అత్యంత ప్రజాదరణ పొందిన టీవీ సీరియల్

రామానంద సాగర్ వారి

# రామాయణం

ఛాయాచిత్ర కథామాల (ఫోటో కామిక్స్)

**12 సంపుటాలలో. హిందీ, ఇంగ్లీషు భాషలలో.**




ప్రచురణకర్తలు :



చందమామ
విజయా కంబైన్స్
188, ఎన్. ఎస్. కె. సాలై, వడపళని, మద్రాసు—600 026.



సాగర్ ఎంటర్‌ప్రైజెస్
నటరాజ్ స్టూడియోస్, అంధేరికుర్లారోడ్, బొంబాయి—400 069.
వారి అనుమతితో.

త్వరలో ఇతర భారతీయ భాషలలోనూ వెలువడనున్నది.



ఇప్పుడు 1వ సంపుటి న్యూస్‌స్టాండ్లలో లభిస్తుంది.

# హ్యాండీప్లాస్ట్ దారిని అనుసరించండి

హ్యాండీబోయ్‌కి తన దెబ్బలకి వేసేందుకు హ్యాండీప్లాస్ట్ స్పాట్, స్ట్రిప్, ప్యాచ్ కావాలి. మరి ఏది ఎక్కడికి దారి తీస్తుందో కనిపెట్టగలరా, మీరు.



అలా గీతలదారిని అనుసరిస్తూ స్పాట్, స్ట్రిప్, ప్యాచ్‌ని హ్యాండీబోయ్ పైన గీయండి.












HTA 1425

కత్తిరించి ఉంచుకోండి

# PARRY'S PAGE




## చిన్నారి స్నేహితులారా

ప్యారీస్ పేజీలు ఊహించలేనంత అద్భుతంగా మారాయి. మేము (నా సహాయకారులు - క్యారమిల్క్, కాఫీబైట్, ట్రైమీ, లాలీపాప్, నేనుకూడా) ప్రత్యేకమైన విషయాలు తీసుకుని మీకు పూర్తిగా వినోదంతో కూడిన పేజీని అందిస్తాము. మరిఇప్పుడు జంతు ప్రపంచములోకి అడుగు పెడతాము! ఇక మీరు ఆశ్చర్యం కలిగించే విషయాలు, వినోదపరచే వింతలు, జంతువులు గురించి ఎన్నెన్నో కొత్తసంగతులు తెలుసు కుంటారు. ఈ సంపుటాలను మీరు కత్తిరించి వుంచుకుంటే అతిత్వరలోనే స్వంతంగా మీకోసం ఒక చిన్న విజ్ఞాన సర్వస్వాన్నీ తయారు చేసుకోవచ్చు.

Parry's THE KING OF SWEETS

## సిపాయి పావురము!

ఫ్రాన్స్‌లో మొదటి ప్రపంచయుద్ధ సమయంలో తుపాకులు కాల్చుతున్నప్పుడు సందేశాలు తీసుకువెళ్ళినందుకు ఒక పావురానికి మెడల్ బహూకరించారు. ఎంతటి సాహసం చేసింది?



# జంతు ప్రపంచం




## చురుకైన చింపాంజీ!

లండన్ జూలో చింపాంజీలు చేసే తమాషాలు చూసేం అక్కడికి వచ్చే సందర్శకులు వాటి మీదకి వస్తువులు విసురుతూ వుంటారు. వాటిలో ఒక చురుకైన చింపాంజీ ఆ వస్తువులని ఏరుకుని జూలో వున్న క్యాంటీన్ కిటికీ దాకా తెచ్చి ఇచ్చేస్తూ వుంటుంది.






## జంతువులన్నీ నీళ్లు త్రాగుతాయి?

అన్ని జంతువులకు నీళ్లుకావాలి. అయితే కొన్ని ఎప్పుడూ నీళ్లు త్రాగవు. కొన్ని జీవులు వాటి శరీరం ద్వారా నీటిని పీల్చుకుంటాయి. కొన్ని ఎడారి ఎలుకలు మంచుతో తడిసిన తేమగా ఉన్న విత్తనాలని తినే నీటిని గ్రహిస్తాయి. ఆ విధంగా కొన్ని జంతువులు జీవితానికి నీళ్లు త్రాగకుండా బ్రతుకుతాయి.






# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["రాజనీతి"]కి ఆధారం ఎస్. శివనాగేశ్వరరావు రచన.

ఈ సంచికతో "తండ్రీకొడుకులు" ముగుస్తున్నది. వచ్చే నెల నుంచి కొత్త సీరియల్ "బందిపోటు యువరాజు" ప్రారంభమవుతున్నది. ఈ కొత్త సీరియల్ పాఠకులను ఆకట్టుకోగలదని భావిస్తున్నాము.

## అమరవాణి

సంపత్సు మహతాం చిత్తం, భవత్యుత్పల కోమలమ్,
ఆపత్సు చ మహాశైల, శిలాసంఘాత కర్కశం.

[గొప్పవారి మనసు సంపదలలో కలువపువ్వులా ఎంతో మృదువుగానూ, ఆపద సమయాలలో కఠిన శిలలాగా చాలా దృఢంగానూ ఉంటుంది.]

సంపుటి 85 ఆగస్టు '89 సంచిక 2

విడి ప్రతి : 3-00 :: సంవత్సర చందా : 36-00



# హెచ్చరిక



చందమామ విజయా కంబైన్స్
మద్రాసు - 26

పై సంస్థ పేరిట 'చందమామ' పత్రికలో ప్రచురింపబడిన కథలను, సీరియల్స్‌నూ తీసుకొని, విడియో పత్రికలుగాను, టెలివిజన్ సీరియల్స్, టెలిఫిల్మ్స్‌గానూ పలుభాషలలో నిర్మించడానికి—మేము 'చందమామ' పత్రిక నిర్వాహకుల వద్ద నుంచి సర్వహక్కులూ పొందియున్నాము. పథకాలను సిద్ధం చేసుకొని నిర్మాణం ఆరంభించబోతున్నాము. అందువలన, 'చందమామ' పత్రికలోని కథలనుగాని, సీరియల్స్‌నుగాని, యథాతథంగా తీసుకోవడమో, అనుకరించడమో, వాటిల్లోని భాగాలను, లేదా సంఘటనలను లేదా పాత్రలను సంగ్రహించి, వాటిని సినిమాల్లోగాని, నాటకాల్లోగాని, విడియో, టి. వి. సీరియల్స్, టి. వి. నాటికల్లోగాని ఎవరైనా, ఏ రూపంలోనైనా ఉపయోగించినట్లయితే, చట్టప్రకారము మేము తీసుకునే చర్యకు బాధ్యులగుదురని, ఇతదుమూలంగా హెచ్చరిస్తున్నాము.

—ప్రొప్రయిటర్స్: చందమామ విజయా కంబైన్స్

# కేమెల్ జామెట్రీ బాక్స్‌ల 5 ప్రత్యేక విశిష్టతలు.




**అత్యంత ప్రజాభిమానాన్ని చూరగొన్న బ్రాండ్ :**
ఈ జామెట్రీ బాక్సులు అత్యధికంగా అమ్ముడవుతున్నాయి. భారతదేశమంతటా గత సంవత్సరం 10,00,000 అమ్ముడయ్యాయి.




**సాటిలేని నాణ్యత :**
పెట్టెలోని రూలర్, సెట్ స్క్వేర్, ప్రొట్రాక్టర్ స్ఫటికంలా కన్పించే స్వచ్ఛమైన ప్లాస్టిక్‌తో తయారుచేయబడ్డాయి. కంపాస్ మరియు డివైడర్ క్రోమ్ ప్లేట్ చేయబడినవి. ఈ విశిష్టతల వల్ల వాటికి నిశితత్వం, మరింతకాలం మన్నిక.

**ఎన్నుకునేందుకు వీలుగా మూడు బ్రాండ్‌లు :**
స్కాలర్, క్యామెల్ మరియు క్లాసిక్ — పేరెన్నికగన్న ఈ మూడూ కేమ్లిన్ అందిస్తున్నవి.




**అనేక రకాల నాణ్యమైన ఇతర ఉత్పాదనలు :**
విస్తృత శ్రేణికి చెందిన ఆర్ట్ మెటీరియల్స్, పెన్సిళ్లు, సాంకేతిక ఉపకరణాలు.

**కేమెల్ — నేడు పరిశ్రమలో అత్యంత ప్రాచీనమైన, పేరెన్నికగన్న పేరు**
ఇది 25 సంవత్సరాలుగా నాణ్యమైన సేవను సమకూర్చిన సంస్థ.




## కేమెల్
జామెట్రీ బాక్సులు—
పోటీలో విజయంలో ఓ కొత్త మలుపు.

కేమ్లిన్ లిమిటెడ్
ఆర్ట్ మెటీరియల్స్ డివిజన్
బొంబాయి-400 059.

VISION/CL/6/TEL

# మహావివేకి!

ఒకానొక గ్రామం వీధిగుండా, యువకుడొకడు గుర్రం ఎక్కి స్వారీ చేసేబదులు, దాని కళ్ళెం తాడు పట్టుకుని పరిగెత్తుతూండడం కొందరు వింతగా చూశారు. వాడు అలా పరిగెత్తి, గ్రామం చివరనున్న సత్రం అరుగుమీద కూర్చుని ఆయాస పడసాగాడు.

సత్రం యజమాని వాణ్ణి, "నీకు గుర్రంతోపాటు పరిగెత్తవలసిన అవసరం ఎందుక్కలిగింది?" అని అడిగాడు.

"నేను చేరవలసిన ఊరు తొందరగా చేరేందుకు," అన్నాడు యువకుడు.

"అలా అయితే, గుర్రంపైనే స్వారీ చేయొచ్చుగదా?" అంటూ ఆశ్చర్యపోయాడు సత్రం యజమాని.

యువకుడు ఏదో రహస్యం దాస్తున్నట్టు చిరునవ్వు నవ్వాడే తప్ప, జవాబివ్వలేదు. సత్రం యజమాని మరింతగా ఆశ్చర్యపోతూ, వాణ్ణి మరొకసారి ప్రశ్నించాడు.

అందుకు యువకుడు, "మొదట నేను వెళ్ళవలసిన ఊరు కాలినడకనే వెళదామనుకున్నాను. కాని, మా యజమాని గుర్రం మీద వెళ్ళమని చెప్పి—రెండు కాళ్ళకంటే, నాలు కాళ్ళకు వేగం ఎక్కువ, అన్నాడు. ఆయన మాట నాకు మరింత వివేకాన్ని కలిగించింది. రెండు కాళ్ళ కన్న, నాలుగు కాళ్ళకు వేగం ఎక్కువైతే, నాలుగు కాళ్ళ కన్న, ఆరు కాళ్ళకు మరింత వేగం ఎక్కువగదా? అందుకని గుర్రం నాలుగు కాళ్ళతోపాటు, నా రెండు కాళ్ళను కూడా ఉపయోగిస్తున్నాను," అన్నాడు.

—దేవప్రియ





# సూది-గొడ్డలి

పూర్వం కోసలదేశాన్ని శాంతివర్ధనుడనే రాజు పరిపాలిస్తూండేవాడు. అయన ఎంతో ప్రజారంజకంగా రాజ్యపాలన చేస్తున్నప్పటికీ, కోసల చాలా పెద్దదేశం కావడంతో, ప్రజలు ఏదో ఒక ప్రాంతాన అశాంతికీ, అసౌకర్యానికీ గురవుతూండేవాళ్ళు. రోజూ తనను చూడవచ్చే పౌరులందరితో మాట్లాడి, వాళ్ళ సమస్యలకు పరిష్కారమార్గం చెప్పి పంపడం అయనకు సాధ్యపడేదికాదు. అందుచేత, ఆయనను చూడవచ్చినవారిలో కొందరు అసంతృప్తి చెందేవారు.

ఇలాంటివి జరక్కుండా చేయడానికి, శాంతివర్ధనుడికి ఒక ఆలోచన తట్టింది. అదేమంటే—సమర్థుడూ, మంచి తెలివి తేటలు గలవాడూ, గుణవంతుడూ అయిన ఒక వ్యక్తిని ఎన్నుకుని, అతణ్ణి తనకూ ప్రజలకూ మధ్య వారధిగా నియమించడం. ప్రజల సమస్యలన్నీ ఓపిగ్గా విని, వాటిని పరిష్కరించే మార్గాలు, ఆయా శాఖాధిపతులకు తెలియజేయడం. వాటి అమలు సరిగ్గా జరుగుతున్నదో లేదో గమనిస్తూండడం అతడు చేయవలసిన పని. అతడు అతి ముఖ్యమైన విషయాలను మాత్రమే, తనకు నివేదించాలి.

ఈ పదవికి, ప్రజాప్రతినిధి అన్న పేరు పెట్టి, తన ఆలోచనలన్నీ మంత్రి కుమారభట్టుకు చెప్పాడు, శాంతివర్ధనుడు.

కుమారభట్టుకు, ఈ ప్రజాప్రతినిధి నియామకం ఆలోచన బాగా నచ్చింది. అందుచేత ఆయన, రాజుతో, "మీ ఆలోచన చాలా బాగుంది. మన దేశ పాలన సర్వజన సంతోషకరంగా వుండాలంటే, ఇటువంటి పదవి ఎంతయినా అవసరం. ప్రజాప్రతినిధికి మీరు సూచించిన గుణాలతో పాటు సహనమూ, ప్రజలకూ

లక్ష్మిగాయత్రి



ప్రభుత్వానికీ మధ్య ఐకమత్యం సాధించ గల నేర్పు కూడా వుండాలి. సత్వరమే అటువంటి వ్యక్తికోసం అన్వేషిద్దాం,'' అన్నాడు.

వెంటనే ప్రజాప్రతినిధి పదవికోసం, అభ్యర్థులనుకోరుతూ, రాజ్యం నలు మూలలా దండోరాలు మోగాయి. చాలా మంది అభ్యర్థులు వచ్చారు. పరీక్షలు జరిగాయి.

ఈ పరీక్షల్లో చివరకు సుకుమారుడు, గుణశీలుడు అనే ఇద్దరు యువకులు శాంతివర్ధనుడికీ, కుమారభట్టుకూ కూడా నచ్చారు. అయితే, ఆ ఇద్దరిలో ఎవరిని ఎన్నుకోవాలన్న సమస్య వచ్చినప్పుడు మాత్రం, శాంతివర్ధనుడు, సుకుమారుణ్ణీ, కుమారభట్టు గుణశీలుణ్ణీ ఎన్నికచేశారు.

''సరే, మహామంత్రీ, నా ఎన్నికే తుది నిర్ణయం అని, నేననను. పరిపాలనా విషయాల్లోనూ, ఉద్యోగులను ఎన్నిక చేయడంలోనూ, మీరు అమిత ప్రజ్ఞాశాలు రన్న సంగతి, నాకు తెలుసు. అయితే, తొలిసారిగా మనిద్దరి మధ్యా భేదాభి ప్రాయం కలిగింది కనక, మనం ఎన్నిక చేసిన యిద్దర్నీ మాతంగ గురువుల దగ్గిరకు పంపించి, వారి తీర్పునే తుది ఎన్నికగా నిర్ణయిద్దాం,'' అన్నాడు శాంతి వర్ధనుడు.

ఇందుకు కుమారభట్టు అంగీకరించాడు. వెంటనే సుకుమార, గుణశీలు రిద్దరూ, మాతంగ గురువులవద్దకు పంప బడ్డారు.

మర్నాటి ఉదయం, గురువుదగ్గిర నుంచి తిరిగివచ్చిన అభ్యర్థులిద్దరూ తిన్నగా రాజూ, మంత్రీ వున్న భవనానికి వెళ్ళారు.

''గురువుగారు, మాకేం సందేశం పంపారు?'' అని కుమారభట్టు వాళ్ళిద్దర్నీ అడిగాడు.

అభ్యర్థులిద్దరూ అందుకు సమాధానంగా, తమవద్ద వున్న వస్తువులను, వారి ముందుంచారు.



''మాతంగ గురువులు, మాకేమీ చెప్ప లేదు. ఈ వస్తువులను తీసుకుపోయి, మీ కివ్వమన్నారు,'' అని చెప్పారు సుకుమార, గుణశీలురు.

సుకుమారుడు తెచ్చినది, ఒక పదునైన గొడ్డలి. గుణశీలుడు తెచ్చిన వస్తువు, ఒక చిన్న సూది.

వాటిని చూస్తూనే మంత్రి కుమారభట్టు చిరునవ్వు నవ్వాడు. రాజు శాంతివర్ధనుడు మాత్రం, ఆ వస్తువులలోని గూఢార్థం బోధపడనివాడిలా మంత్రికేసి చూశాడు.

కుమారభట్టు, ఆయనతో, "మహారాజా, గురువులు చెప్పదలచిందేమిటో, నేను గ్రహించాను. అయితే, అదేమిటో ఈ అభ్యర్థులచేతనే చెప్పించటం, వారి సునిశిత మేధస్సుకు మరొక పరీక్ష అవుతుంది. అందుచేత, ఎవరివస్తువు తాలూకు అంతర్యాలు, వారే చెబుతారు,'' అన్నాడు చిన్నగా నవ్వుతూ.

శాంతివర్ధనుడు అంగీకారంగా తల వూపి, సుకుమారుడివైపు చూసి, చెప్ప మన్నట్టుగా సంజ్ఞ చేశాడు.

సుకుమారుడు వెంటనే ఆనందమూ, కొద్దిపాటి గర్వమూ మేళవించిన గంభీర స్వరంతో, ''ప్రభూ, మాతంగగురువు, యీ గొడ్డలి ద్వారా, నా సమర్థతను తెలియజెప్ప చూశారని, నా అభిప్రాయం. ఈ గొడ్డలి ఎంత పదునుగా తళతళలాడుతున్నదో, నా మేధస్సు కూడా అంత పదునుగా జగజ్జేగీయమానంగా వుంటుంది! ఎంత కఠినమైన చెట్టుబోదెనైనా క్షణాలలో యీ గొడ్డలి ఎంత తేలికగా ఛేదించగలదో, అలాగే నా మేధస్సు కూడా ఎంతటి జటిల సమస్యనైనా యిట్టే పరిష్కరించి వేయగలదు. గురువులు దీన్ని నాకివ్వడం అనేది, నా ప్రతిభకే గీటురాయిగా భావిస్తున్నాను. అందుచేత, ప్రజాప్రతినిధి పదవికి మాతంగ గురువుగారు, నన్నే ఎన్నిక చేశారని, నా నమ్మకం!'' అన్నాడు.

సుకుమారుడి వివరణ నచ్చినట్టు, రాజు ముఖంలో ఎంతో తృప్తి, ప్రసన్నతా కనిపించాయి.

తర్వాత గుణశీలుడు ఎంతో వినయంగా, "ప్రభూ, సాటి అభ్యర్థిని కించపరుస్తున్నానని అనుకోకండి. సుకుమారుడు గొడ్డలి గురించి చెప్పినదంతా నిజమేగాని, అతడు ఒక్క విషయం మాత్రం మరిచిపోయాడు. గొడ్డలి ఎండుకట్టెనైనా, చందనవృక్షాన్నయినా, ఒకటిగా వున్నదాన్ని ముక్కలుగా చెయ్యడానికే ఉపయోగిస్తుంది. సూది మాత్రం ఆకారంలో ఎంత చిన్నదయినా చిరిగి రెండుగా చీలిపోయిన వస్త్రాన్ని కుట్టి, మళ్ళీ ఒకటిగా చేస్తుంది. గొడ్డలి వినాశనానికి చిహ్నం. సూది ఐకమత్యానికి ప్రతినిధి!" అని పూరుకున్నాడు.

గుణశీలుడి మాటలు వినగానే, రాజు శాంతివర్ధనుడు కొంచెం తికమకపడి, మంత్రికుమారభట్టుకేసి చూశాడు.

అప్పుడు కుమారభట్టు, అయనతో, "ప్రభూ, గుణశీలుడి వర్ణన పూర్తిగా సత్యం. సుకుమారుడు తెలివైనవాడేగాని, అతడిలో సహనమూ, ఐకమత్యాభావమూ తక్కువ. మనం ప్రజాప్రతినిధిగా నియమించబోయే వ్యక్తికి, ముఖ్యంగా వుండవలసిన గుణాలు, అవేనని భావించిన మాతంగగురువు, గుణశీలుణ్ణే ఎన్నిక చేశారు. ఆయన ఎన్నిక ఎంత సమంజసమో, వీళ్ళిద్దరి వివరణలద్వారా, మీరు గ్రహించే వుంటారు. ఆకారంలో పెద్దది, పదునైనది అయిన వస్తువును తనకిచ్చేసరికి, పదవి తనదేనని సుకుమారుడు గర్వపడ్డాడు. సరిఅయిన అవగాహనతో పదవి తనదేనని విశ్వసించినా, వినయంగా వస్తువుతాలూకు అంతర్యం మాత్రమే చెప్పి పూరుకున్నాడు, గుణశీలుడు. ప్రజాప్రతినిధి పదవికి, అతడే అన్ని అర్హతలూ గల వ్యక్తి!" అన్నాడు.

మంత్రి చెప్పినదానితో సంతృప్తి చెందిన శాంతివర్ధనుడు, గుణశీలుణ్ణి అప్పటికప్పుడే ప్రజాప్రతినిధిగా నియమించాడు.






## 4

బడి నుంచి ఇంటికి చేరిన సూరయ్యకు కడుపులో మాడిపోతున్నది. ఆయనకోసం వంటలక్క కూడా వాకిట్లో కనిపెట్టుకుని ఉన్నది.

"రా, నాయనా! ఎప్పుడో పొద్దున తిన్న అన్నం!" అంటూ వంటలక్క సూరయ్యను కూచోబెట్టి వడ్డించింది. ఆయన అన్నం తింటుండగా, "పంతులు బాగా కొట్టాడా?" అని అడిగింది. సూరయ్య మొహం ఎర్రబడింది సిగ్గుతో.

"నాకోసం ఎవరైనా వచ్చారా?" అన్నాడు సూరయ్య మాట మార్చటానికి.

"నీకోసం ఎవరువస్తారు, నాయనా?" అన్నది వంటలక్క.

సత్యం విషయం వంటలక్క నడగాలనుకున్నాడు గాని, ఎట్లా అడగాలో తెలియలేదు. అదృష్టవశాత్తూ వంటలక్కే చెప్పింది.

"మీ నాన్నగారి కోసం చాలామంది వచ్చారు. కాని ఆయనకు ఒంట్లో బాగున్నట్టు లేదు. ఒకరిద్దర్ని చూసి మరెవర్నీ చూడననిపోయి గదిలో ముసుగుతన్ని పడుకున్నారు," అనిచెప్పింది వంటలక్క.

"ఎవరెవరు వచ్చారు?" అని అడిగాడు సూరయ్య.

వంటలక్క ఇద్దరు ముగ్గురి పేర్లు చెప్పింది. సూరయ్య ఆదుర్దా జాస్తి అయింది. గబగబా తిండి పూర్తిచేసి తన



గదికి వెళ్ళి తలుపు తట్టాడు. ఎన్నిసార్లు తలుపు తట్టినా జవాబు లేదు.

"సత్యం, సత్యం," అని పిలిచాడు.

"నువ్వా?" అన్నాడు సత్యం.

"తలుపు తియ్యి. మాట్లాడాలి," అన్నాడు సూరయ్య.

"నేనిప్పుడు నిద్రపోతున్నాను. రాత్రికి మాట్లాడదాం," అన్నాడు సత్యం.

సూరయ్య తలుపు తియ్యమని పెద్దగా అరిచాడు. కాని నౌకరువచ్చి సూరయ్యను రెక్కపట్టుకుని కిందికి లాక్కొచ్చాడు.

"నీ సంగతేమీ బాగా లేదు. అల్లరిచేస్తే మీ నాన్నగారు మక్కెలు విరగొడతారు," అని హెచ్చరించి నౌకరు వెళ్ళిపోయాడు.

సూరయ్యకు ఇంకో ఉపాయం తట్టింది. తనకు వ్యవహారాలున్న వాళ్ళందరికీ ఉత్తరాలు రాద్దామనుకున్నాడు. కాని, తన దస్తూరిచూస్తే ఎరిగినవాళ్ళు గుర్తించేటట్టుగా లేదు. సూరయ్య దీర్ఘమైన ఆలోచనలో పడ్డాడు. ఎటుచూసినా తప్పించుకునే మార్గం లేదు. మళ్ళి కాస్సేపటికి బడికిపోవాలి. సూరయ్య తన సొంత విషయమే ఆలోచిస్తాడా? ఇంటి వ్యవహారాలే ఆలోచిస్తాడా?

సత్యం రహస్యం బయటపడేవరకు తన సంగతి ఎవరూ పట్టించుకోరు. అంతదాకా తను ఎక్కడికైనా పారిపోతే చాలా చిక్కులు వదిలిపోతా యనిపించింది. ఈ సంగతి సత్యానికి తెలిస్తే పోనివ్వడు. డబ్బు దొరికే ఉపాయం లేదు. డబ్బు లేకుండానే పారిపోదామనుకున్నాడు. వంటలక్కగాని ఇంట్లో నౌకర్లుగాని చూడకుండా ఇంట్లో నుంచి బయటపడి స్టేషనుకేసి నడిచాడు సూరయ్య. మధ్యాన్నం రెండున్నరకొకబండి ఉన్నది. అది ఎక్కపోవచ్చు. ఎక్కడికి పోవాలి ఏం చెయ్యాలనేది అతడు ఆలోచించలేదు.

పగలల్లా సత్యం గదిలో కూర్చుని తలుపు బిడాయించుకున్నాడు. ఎవరో డబ్బు బదులు కావాలని వచ్చారు. వాళ్ళెవరో కూడా తెలియకుండా వంట



లక్క చేతికి పదిరూపాయలిచ్చి వాళ్ళ కిమ్మన్నాడు. మరెవరో వచ్చి తమకు సూరయ్య ఇరవైరూపాయలు బాకీ ఉన్నా డని చెప్పారు. ఆ డబ్బు కూడా ఇచ్చి పంపాడు. ఇంకెవరో చిన్న వ్యవహారం మాట్లాడాలని వచ్చారు. సత్యం బయటికి రాలేదు.

ఇదంతా సత్యానికి ఇరకాటంగానే ఉంది. కాని ఇంతకన్నా అతనికి భయం వేసిన దేమంటే వంటలక్కకీ, ఇంట్లో నౌకర్లకీ తనని గురించి అనుమానం కలగ సాగింది. వంటలక్క తనకేసి అదో మోస్తరుగా చూస్తోంది. తాను సూరయ్య కాదని ఎవరూ అనుకోరనే ధైర్యంతో ఉంటూ వచ్చాడు సత్యం. కాని ఆ ధైర్యం ఇప్పుడు దిగజారసాగింది. తన మాటల లోనూ చేతలలోనూ తన లక్షణాలుండక ఏమవుతుంది? అనుమానం కలగనే కూడదు గాని, కలిగితే అది క్షణంలోకి నమ్మకంగా మారుతుంది. ఈ మార్పు అచ్చగా తనలోనే అయితే అంత ఇబ్బంది లేకపోను. తన తండ్రి కాస్త కూడా తన మాదిరిగా ప్రవర్తించటం లేదు. మొదట లేదుగాని, ఇప్పుడిప్పుడు తండ్రిని చూడ గానే అయన మొహం చప్పన పోల్చుకోవ టానికి వీలవుతున్నది. ఎనిమిది తొమ్మిదేళ్ల లేత మొహంలో ఎక్కడో యాభైఏళ్ళవాడి ఛాయలున్నాయి. అద్దంలో చూసుకుంటే తన మొహంలో కూడా క్రూర లక్షణాలు కనిపిస్తున్నాయి. ఈ లక్షణాలు పైవాళ్ళు మటుకు చూడరా? వంటలక్క చూసే ఉండాలి!

పొద్దూకింది, చీకటిపడింది. కాని సత్యం బయటికి రావటానికి సాహసించలేదు. తన తండ్రికోసం, రాత్రి పొద్దుపోయాక కూడా ఎవరో ఒకరు వస్తూ ఉంటారు.

ఎనిమిది గంటలవేళకు వంటలక్క పైకివచ్చి, "బాబూ, అబ్బాయి జాడ లేదు," అని చెప్పింది.

"బళ్ళోనుంచి తిరిగి రాలేదా?" అన్నాడు సత్యం.



నిజం చెప్పేస్తాడని భయపడుతూ సత్యం ఈ మాట అన్నాడు.

''అబ్బాయికొచ్చిన భయమేమీ లేదు. మీరు వచ్చి భోంచెయ్యండి,'' అన్నది వంటలక్క.

''నే నిప్పుడు రాను. ఇంకా స్త అగి తింటా,'' అన్నాడు సత్యం.

''ఇంకా నయం. అన్నం తిన్న తరవాత రెండు గంటలన్నా మేలుకుని ఉండాలని వైద్యుడు చెప్పలా? పెందలాడే రెండు మెతుకులు తినండి. అసలే జబ్బువాళ్ళు,'' అని వంటలక్క వెళ్ళిపోయింది.

సత్యం మారుమాట లేకుండా వెళ్ళి భోంచేశాడు. భోజనంచేసి చెయ్యి కడుక్కుని లోపలికి వస్తుండగా, ''ఏంరోయ్, సూరయ్యా?'' అంటూ ఒక పెద్దమనిషి వచ్చాడు. ఆయన్ని చూడగానే సత్యం పైప్రాణాలు పైనే పోయాయి. ఎందుచేత నంటే, ఈ వచ్చినాయన న్యాయవాది. తన తండ్రికి బాల్యస్నేహితుడు. తండ్రి న్యాయస్థానం వ్యవహారాలన్నీ చూస్తూ ఉంటాడు. తరుచు రాడుగాని వచ్చినప్పుడల్లా ఎవరికీ అర్థంగాని విషయాలు మాట్లాడి పోతూ ఉంటాడు. తన తండ్రి ఏపని ఉన్నా మానుకుని ఈయనతో మాట్లాడతాడు.

పరంధామయ్యగారు స్వతంత్రంగా సత్యం వెంట పైకి వచ్చాడు. కుర్చీలో

''సాయంకాలం బడికి పోనేలేదు. ఎక్కడికైనా ఆడుకోబోయినాడనుకున్నా,'' అన్నది వంటలక్క.

''అదేమిటి? కోప్పడి బడికి పంపక పోయావా?'' అన్నాడు సత్యం.

''ఇప్పుడు అబ్బాయిని కోప్పడేట్టుగా లేదు. వెనకటి అబ్బాయి కాదు. మిమ్మల్ని కోప్పడమన్నా కోప్పడతానుగాని అబ్బాయి కేసి చూడటానికే భయంగా ఉంది,'' అన్నది వంటలక్క.

సత్యం అనుకున్నంతా అవుతోంది. ఇక నిజం ఎంతోకాలం దాగదు!

''ఏమైనాడో?'' అన్నాడు సత్యం. తన తండ్రి ఏదో ఉపాయం చేసి ప్రపంచానికి

కూర్చుని ఏమిటేమిటో మాట్లాడాడు. అంతా న్యాయస్థానం వ్యవహారమే. సత్యానికి ఒకటే అర్థమయింది. రేపు న్యాయస్థానానికి వెళ్ళాలి. సూరయ్య సాక్ష్యం అతి ముఖ్యమైన సాక్ష్యం. ఏ ప్రశ్నలకు ఏ సమాధానాలివ్వాలో పరంధామయ్య చాలా సేపు చెప్పాడు. ఒక్కటీ సత్యం బుర్రలో ఎక్కలేదు. రేపు తాను న్యాయస్థానానికి వెళ్ళటమా, వెళ్ళకుండా తప్పించుకోవటమా అని ఆలోచిస్తున్నాడు.

పది గంటలదాకా కూర్చుని పరంధామయ్య వెళ్ళిపోయాడు. కాని ఎంతకీ సత్యానికి నిద్రపట్టలేదు. తన తండ్రి ఏమైనట్టు? రేపు తనసంగతి ఏమయ్యేట్టు?

అకస్మాత్తుగా సత్యానికి తండ్రి మీద గౌరవం కలిగింది. ఈ ప్రపంచం తన తండ్రిది; తనది కానేకాదు. ఈ విషయం తాను విచారించటం అనవసరం. తను తండ్రిని ఎన్నడూ సరిగా అర్థం చేసుకోక అన్యాయం చేశాడు. తండ్రి తనకి ఏమపకారం చేశాడు? చదువుకో మన్నాడు, భయభక్తులతో ఉండమన్నాడు. తన తండ్రి భయభక్తులతో చదువుకోబట్టేకదా తాను చెయ్యలేని వ్యవహారాలన్నీ చేస్తున్నాడు. భగవంతుడి దయవల్ల తను మళ్ళీ చిన్నవాడైతే ఎన్నటికీ తన జీవితం గురించి విచారించ ననుకున్నాడు సత్యం.



ఇదే సమయంలో ఇంటి మెట్ల మీద సూరయ్య కూచుని ఉన్నాడు చీకట్లో. జరిగినదేమిటంటే, సూరయ్య రెండున్నర గంటల బండి ఎక్కాడు. రెండు మూడు స్టేషనులు దాటగానే టిక్కెట్టు కలెక్టరొకడు వచ్చి అయన్ను టిక్కెట్టు అడిగాడు. నిజంగా పసివాడైతే అంత బిక్క మొహం పెట్టకపోను సూరయ్య. కాని అన్నీ తెలిసినవాడు కనక టిక్కెట్టు కలెక్టరును చూడగానే సూరయ్య తప్పు చేసిన మొహం పెట్టాడు. సూరయ్య జేబులో దమ్మిడీలేదు. సూరయ్య చెంపలు రెండూ వాయించి రైలునుంచి దింపేశాడు టిక్కెట్టు కలెక్టరు.



పడుతున్నాడో ఆలోచించలేదు. వాణ్ణి అపేక్షగా పలకరించి ఎంతకాలమయింది? కన్నతండ్రి ఎవడైనా ఇట్లా చేస్తాడా? భగవంతుడి దయవల్ల మళ్ళీ తాను ఎప్పటిలాగ అయితే కొడుకును ఎంతో అపేక్షగా చూస్తానను కున్నాడు. వాడికి కష్టం గలగనివ్వ ననుకున్నాడు.

ఇదంతా చూస్తూన్న లక్ష్మి అమ్మవారు సత్యనారాయణస్వామివారితో, "పాపం, వాళ్ళిద్దరి కోరికలూ చెల్లించండి," అన్నది.

సరేనన్నారు స్వామివారు.

మెట్లమీద కూర్చున్న సత్యం ముసలివాడయిపోయాడు. లోపలి గదిలో మంచం మీద పడుకున్న సూరయ్య కుర్రవాడై పోయాడు.

"ఇక వాళ్ళిద్దరూ సుఖంగా ఉంటారు," అన్నది అమ్మవారు.

"ఏం జరుగుతుందో ఇప్పుడే చూద్దువు గాని," అన్నారు స్వామివారు.

చేసేదిలేక సూరయ్య కాళ్ళీడ్చుకుంటూ పదహారుమైళ్ళదూరమూ నడిచి, తిండికి మాడుతూ దుమ్ముకొట్టుకుని రాత్రి పదకొండింటికి ఇల్లు చేరుకున్నాడు. తలుపుతట్టి పిలిస్తే అందరూ తలో ప్రశ్న అడుగుతారు. అందుచేత మెట్ల మీద కూర్చుని ముందు జరగవలిసినదాన్ని గురించి ఆలోచించసాగాడు.

ఇక తను కుర్రవాడుగా ఒక్క రోజు కూడా గడపలేదు. ఈ ప్రపంచం కుర్రవాళ్ళదికాదు. తను ఒకప్పుడు కుర్రవాడై ఉండి కూడా వాళ్ళ కష్టసుఖాలు మరిచాడు. తన కొడుకు మొండితనమే చూశాడుగాని వాడు ఎన్ని ఇబ్బందులు

సూరయ్య మెట్లమీద లేచి నిలబడ్డాడు. చాలా ఎత్తు లేచినట్టు అయనకు అనుమానం తట్టింది. కాని తన స్వరూపం మారినట్టు ఇంకా అయనకు తెలీదు. తలుపు గట్టిగా తట్టితే ఇంటిల్లిపాదీ లేస్తారు. అనేక ప్రశ్నలు వేస్తారు. ఒకరికైతే ఏదో ఒకటి చెప్పవచ్చు. అందుకని సూరయ్య మెల్లిగా తలుపు తట్టాడు.

వంటలక్క వచ్చి తలుపు తీసింది. సూరయ్యను చూసి ఆశ్చర్యపోతూ, ''మీరు బయిటి కెప్పుడు వెళ్ళారు, బాబూ? గదిలో పడుకుంటిరే? తలు పెవరు వేశారు?'' అని అడిగింది.

కాని సూరయ్యకు వంటలక్క ప్రశ్న లేవీ వినిపించటం లేదు. ఇంతకాలానికి గాను వంటలక్క తనని ఎప్పటిమాదిరిగా బాబూ అని పలకరించింది! మొహం తడువుకున్నాడు. మీసాలూ, కళ్ళజోడూ తగిలాయి! నెత్తి బట్టతల! సంతోషం పట్టలేక సూరయ్య కళ్ళవెంట కన్నీరు ప్రవాహంగా కారింది. ఏదో అనబోయాడు గాని మాట రాలేదు.

వంటలక్క గొంతువిని సత్యం మెట్లు దిగి వచ్చి, తన తండ్రిని చూసి నిర్ఘాంత పోయాడు. తనచేతులకేసిచూసుకున్నాడు.

సత్యాన్ని చూడగానే సూరయ్యకు భగ్గుమని మండిపోయింది. ఈ వెధవేగదా తనకిన్ని కష్టాలు కలిగించాడు అను కున్నాడు. తనను బడికి పంపించాడు, పంతులుచేత కొట్టించాడు, గోడకుర్చీ వేయించాడు, తన శరీరం దొంగిలించాడు, తన పడకగది కాజేసి, తన తాళపు చెవులూ, డబ్బూ, అన్నీ లాక్కున్నాడు.

''వెధవా! నీ ఆట ఇప్పటికి కట్టిందా?'' అని సూరయ్య రంకె పెట్టాడు.

సత్యానికూడా తండ్రిని చూస్తే మండి పోయింది. తన తండ్రే తనకు ఆ ముసలి శరీరం అంటగట్టాడు. ఇంత తినటానికి లేదు. పరిగెత్తటానికిలేదు, చెట్లెక్కటానికి లేదు. ముసలితనంలో తన శరీరం లాక్కొని కుర్రాడల్లే తిరిగాడు. ఇప్పుడు తన మీద కోప్పడుతున్నాడు.

''నా ఆటేకాదు, నీ ఆటా కట్టింది,'' అన్నాడు సత్యం పట్టలేని ఆగ్రహంతో.

* * *

''చూశావా? వాళ్ళ లోపాలను వాళ్ళు సవరించుకోవాలి. మనం ఏమీ చెయ్యలేం! మనం ఇచ్చిన రెండువరాలూ మరిచి వీళ్ళు మళ్ళీ ఎప్పటిలాగే ఉన్నారు!'' అన్నారు స్వామివారు. —(అయిపోయింది)



# మోసం చేస్తున్నదెవరు?

ఒక గ్రామంలోని కూరగాయలమ్మే దుకాణంవాడు, గ్రామాధికారి దగ్గిరకుపోయి ఫిర్యాదొకటి చేశాడు. అదేమంటే—గ్రామంలో పాలూ, పెరుగూ, వెన్నా అమ్ముతూండే వెంకమ్మను, తను రోజూ సాయంత్రంవేళ, ఒక వీశెడు వెన్న పంపమన్నాడు. అయితే, ఈమధ్య ఆపిడ మోసం చేస్తున్నది. ఆమె పంపుతున్న వెన్న తూచి చూస్తూంటే వీశెకు తక్కువగా వుంటున్నది.

ఈ ఫిర్యాదు విని గ్రామాధికారి ఆశ్చర్యపోయాడు. ఆయన వెంకమ్మను బాగా ఎరుగు. ఆమె ఎంతో నిజాయితీపరురాలు. ఏది ఏమైనా ఫిర్యాదు వచ్చింది కనక, ఆయన వెంకమ్మను పిలిపించి, వెన్నను ఎలా తూకం వేస్తున్నావని అడిగాడు.

అందుకు వెంకమ్మ, "ప్రతిరోజూ నేను, యీయన దుకాణంలో, ఒక వీశెడు కూరగాయలు కొంటూంటాను. ఈయన మనషడు వెన్నకోసం నా ఇంటికి వచ్చినప్పుడు, త్రాసులో ఆ వీశెడు కూరగాయల్ని ఒక పక్కనేపెట్టి, దాని బరువుకు సరిపడా వెన్నను తూచి యిస్తూంటాను," అన్నది.

ఇది విన్న గ్రామాధికారి కోపంగా, దుకాణంవాణ్ణి, "ఇప్పుడు తెలిసిందా ఎవరు ఎవర్ని మోసం చేస్తున్నదీ?" అని అడిగాడు.






# రాజనీతి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని భేతాళుడు, "రాజా, నువ్వు తోటిరాజులచేతా, ప్రజలచేతా గొప్పవాడు, ధర్మప్రభువు అనిపించుకోవాలన్న కీర్తికాంక్ష కలవాడవన్న అనుమానం కలుగుతున్నది. ఒకవేళ నువ్వు అలాంటివాడివైతే, అందుకు సులభమార్గాలు చాలా వున్నవి. శ్మశానంలో అర్ధరాత్రివేళ యింతగా శ్రమలకు గురికావలసిన అవసరం లేదు. ఇందుకు ఉదాహరణగా, శరణాగతుడనే రాజు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

వైశాలీరాజ్యాన్ని పాలించే శరణాగతుడు శాంతిప్రియుడు. అతడు చుట్టు

## బేతాళ కథలు



పక్కలగల రాజులతో స్నేహపూర్వకమైన సంబంధాలు కలిగివుండేవాడు. అతడు సకల క్షాత్రవిద్యలలోనూ ఆరితేరిన వాడు.

ఒకసారి సౌవీర రాజు కాలవర్మ, వైశాలీరాజ్యాన్నికబళించాలని ఒక పథకం వేశాడు. శరణాగతుడి శాంతిప్రియత్వం, అతడికి పిరికితనంగా తోచింది. కాలవర్మ హఠాత్తుగా సైన్యాన్ని సమాయత్తం చేసి, వైశాలీరాజ్యపు సరిహద్దులను దాటాడు. ఇది విన్న శరణాగతుడు, అతడికి తన రాయబారి ద్వారా ఇలా కబురు పంపాడు :

"నీ రాజ్యకాంక్షకు మన ఇరుపక్షాల లోని వేలాదిమంది సైనికులను బలి పెట్టడం, నాకిష్టం లేదు. నిజంగా నీ శక్తి మీద నీకు నమ్మకముంటే, నాతో ద్వంద్వ యుద్ధానికి తలపడు. నేను ఓడితే, నా రాజ్యాన్ని నీకప్పగించి నీకు బందీనవుతాను. నీవు ఓడితే, నీ రాజ్యం నాకు అప్పగించు."

కాలవర్మ ఇందుకు అంగీకరించాడు. శరణాగతుడి కోటముందున్న విశాలమైన ఖాళీప్రదేశంలో ఇందుకు అవసరమైన ఏర్పాట్లు జరిగినై.

శరణాగతుడూ, కాలవర్మా కత్తులు దూసి పోరు ప్రారంభించారు. చుట్టూ చేరిన ప్రజలు, వారిద్దరి మధ్యా జరుగుతున్న కత్తియుద్ధాన్ని సంభ్రమాశ్చర్యాలతో చూడసాగారు. కొంతసేపటికి, కాలవర్మ చేతిలోని కత్తి ఎగిరి దూరంగా పడింది. శరణాగతుడి ఖడ్గం కాలవర్మ కంఠాన్ని తాకి ఆగింది.

కాలవర్మ తన ఓటమిని అంగీకరించి, "నన్ను బంధించి, నా రాజ్యాన్ని నీ హస్తగతం చేసుకో!" అన్నాడు.

అందుకు సమాధానంగా శరణాగతుడు, కాలవర్మను తన వెంట సభకు తీసుకుపోయి, నిండుసభలో అతణ్ణి చాలా ఘనంగా సత్కరించి, "నీ రాజ్యం నాకవసరం లేదు. నువ్వే ఏలుకో," అన్నాడు.

కాలవర్మ ఆశ్చర్యపోయి, "నీ పట్ల చాలా మూర్ఖంగా ప్రవర్తించాను. అలాంటి నన్ను ఎలా క్షమించగలవు?" అని అడిగాడు

"నువ్వు మూర్ఖుడివైతే, నాతో ద్వంద్వ యుద్ధానికి అంగీకరించేవాడివి కాదు. జన నష్టం జరగకుండా, నాతో ద్వంద్వ యుద్ధానికి తలపడి, నీ మానవత్వాన్ని చాటుకున్నావు. అందుకే నీకీ ఘనమైన సత్కారం." అని చెప్పి శరణాగతుడు, కాలవర్మను అతడి రాజ్యానికి గౌరవంగా సాగనంపాడు.



ఈ సంఘటన తర్వాత, సాటి రాజుల మధ్య శరణాగతుడికి మంచి పేరు ప్రతిష్ఠలు కలిగాయి.

కొన్నాళ్ళ తర్వాత వైశాలీ రాజ్యంలో దొంగతనాలు ఎక్కువయాయి. ప్రజలు దీన్ని గురించి రాజుతో మొరబెట్టుకున్నారు. శరణాగతుడు దొంగలను పట్టవలసిందిగా, అధికారులను ఆజ్ఞాపించాడు. వాళ్ళు దొంగలను పట్టుకోలేకపోయినా, వాళ్ళ నాయకుడు నాగభైరవుడని తెలుసుకోగలిగారు. వాడి నివాసస్థానం, నగరానికి తూర్పున వున్న అరణ్య ప్రదేశం.

శరణాగతుడు, నాగభైరవుణ్ణి బంధించ గలిగినవారికి పదివేల వరహాల బహుమానం యివ్వగలనంటూ రాజ్యంలో చాటింపు వేయించాడు. ప్రజలలో కొందరు ధైర్యవంతులు యిందుకు పూనుకుని, నాగభైరవుడి చేతిలో ప్రాణాలు కోల్పోయారు.

చివరకు శరణాగతుడే రంగంలోకి దిగవలసి వచ్చింది. ఆయన ఒకనాడు వేటగాడిలా వేషం వేసుకుని, మెరికల్లాంటి పదిమంది సైనికులను రహస్యంగా తనను అనుసరించి రమ్మని అరణ్యంలోకి వెళ్ళాడు.

శరణాగతుడు అరణ్యంలో తిరుగుతూండగా, ఒక పొదచాటునుంచి పెద్దపులి ఒకటి ఆయనమీదికి ఉరికింది. శరణాగతుడికి ఒరనుంచి కత్తిదూసే సమయం



కూడా లేకపోయింది. అంతలో రివ్వుమంటూ బాణం ఒకటి వచ్చి, పులి గుండెల్లో గుచ్చుకున్నది. పులి వెల్లకిలా పడి తన్నుకోసాగింది.

అప్పుడు ఆజానుబాహుడొకడు కోర మీసాలను దువ్వుకుంటూ, శరణాగతుడి ముందుకు వచ్చి, "ఎవరు నువ్వు? వేటగాడివా? నీపేరేమిటి?" అని గద్దిస్తూ అడిగాడు.

"నాపేరు నీలకంఠుడు, వేటగాణ్ణి, నా ప్రాణం కాపాడిన నివెవరివి?" అని ప్రశ్నించాడు శరణాగతుడు.

"నా పేరు నాగభైరవుడు, రాజ్యంలోని ప్రజలకేకాదు, రాజుకూడా నేనంటే ఎక్కడలేని భీతి!" అన్నాడు ఆజానుబాహుడు.

అంతలో, రాజును రహస్యంగా అనుసరించి వస్తున్న సైనికులు అక్కడికి చేరారు. శరణాగతుడు వాళ్ళకు, నాగభైరవుణ్ణి బంధించవలసిందిగా ఆజ్ఞ యిచ్చాడు. సైనికులు మూకుమ్మడిగా, వాడిమీద పడి బంధించారు.

బందీ అయిన నాగభైరవుడు, పులివాత బడకుండా తను కాపాడిన వ్యక్తి మహారాజని గ్రహించి, "మహారాజా, నేను నీ ప్రాణదాత నన్న సంగతి మరిచి, నన్ను బంధించావు. ఇలా పదిమంది ఒక్కుమ్మడిగా మీదపడి బంధించడంకాదు. నీలో ధైర్యసాహసాలుంటే, ఇప్పుడే నాతో కత్తి యుద్ధానికి రా!" అన్నాడు పళ్ళు కొరుకుతూ.

శరణాగతుడు, వాడి మాటలు విననట్లు వూరుకుని, సైనికులతో, "ఈ గజదొంగను భద్రంగా పట్టుకుతెచ్చి చెరసాలలో వేయండి," అని, వాళ్ళ వెంటవున్న అశ్వాన్ని ఎక్కి నగరంకేసి బయలుదేరాడు.

ఇది జరిగిన నెలరోజులకు, శరణాగతుడు విశ్రాంతి మందిరంలో వుండగా, భటుడొకడు వచ్చి, "ప్రభూ, అత్యవసరం అయిన పనిమీద, మిమ్మల్ని దర్శించా

లంటూ ఎవరో ఒక మనిషి వచ్చాడు.'' అని చెప్పాడు.

''సరే, తీసుకురా!'' అన్నాడు శరణాగతుడు.

కొంతసేపటికి కాషాయ వస్త్రాలతో, పెద్ద గడ్డం, మీసాలతో వున్న దృఢకాయుడొకడు శరణాగతుడి దగ్గిరకు వచ్చి, ''మహారాజా, నా పేరు కపాలకంఠుడు. నేనొక మంత్రవేత్తను. నేను యక్షిణీ దేవికి యజ్ఞంచేయ తలపెట్టాను. అందుకు రోజుకొక బాలుడి చొప్పున నెలరోజుల పాటు దేవికి బలియివ్వవలసి వుంటుంది. బాలురను సంపాయించడం, నాబోటి మహాశక్తిమంతుడికి అతిసులభం. అయితే, ఆ పని రాజువైన నీ ద్వారా జరిగితే, దేవి మరింత సంతుష్టి చెందుతుంది. నీ సహాయానికి బదులుగా, ఆసేతు హిమాచల ప్రాంతానికంతకూ చక్రవర్తిని చేస్తాను.'' అన్నాడు.

ఆ మాటలకు కోపగించిన శరణాగతుడు, గోడకు వేళ్ళాడుతున్న కత్తి తీసి, కపాలకంఠుడికేసి ఝళిపించాడు. అయితే, కపాలకంఠుడు తన మంత్రశక్తితో కత్తిని బూడిద చేసి, ''రాజా, నన్నెదిరించి గెలవగలవాడు, యీ భూప్రపంచంలోనే లేడు. నాకు సహాయపడకపోవడం, నీ దురదృష్టం!'' అని, ఆవేశంగా అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

ఆ మర్నాటినుంచీ, రాజ్యంలో చిన్నపిల్లలు మాయం కాసాగారు. ఇది మంత్ర





ముందు పెట్టి, కళ్ళు మూసుకుని, ఒంటి కాలిమీద నిలబడి దీక్షతో స్తోత్రపాఠం పలుకుతూండగా, శరణాగతుడు వెనక నుంచి వెళ్ళి, ఒక్క వేటున వాడి తల తెగ వేశాడు.

మరుక్షణం విగ్రహం దివ్యతేజస్సుతో ప్రకాశించింది. గంటలు మోగాయి. విగ్రహంనుంచి, "మహావీరా! నీ ధైర్య సాహసాలు అసాధారణం. ఇదిగో, నీకీ దివ్యఖడ్గం ప్రసాదిస్తున్నాను!" అన్న మాటలు వెలువడినై.

శరణాగతుడు దివ్యఖడ్గాన్ని తీసుకుని, బలికానున్న బాలుడితో తన ప్రాసాదం చేరాడు.

వేత్త కపాలకంఠుడి పని అని గ్రహించిన శరణాగతుడు, ఆ దుష్టమాంత్రికుడు ఎక్కడ యజ్ఞం చేస్తున్నదీ తెలుసుకు రమ్మని వేగులను రాజ్యం నలుమూలలకు పంపాడు.

ఒకానొక కీకారణ్యంలోని పెద్ద కొండ గుహలో, కపాలకంఠుడు వున్నట్టు తెలుసు కున్న శరణాగతుడు, ఒంటరిగా బయలు దేరి వెళ్ళి, వాడున్న గుహలోని ఒక రాతి స్తంభం చాటున రహస్యంగా దాక్కు న్నాడు.

కొద్ది సేపటి తర్వాత కపాలకంఠుడు, ఒక పసిబాలుడితో గుహ చేరాడు. వాడు బాలుణ్ణి యక్షిణీదేవి విగ్రహం పాదాల

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, శరణాగతుడు తాను ధర్మప్రభువూ, మహా వీరుడూ అనిపించుకోవాలన్న కీర్తి కాంక్షతో, ప్రతిపనీ ఒక పథకం ప్రకారం చేశాడని, నాకు సందేహం కలుగుతున్నది. తనపై దండెత్తి వచ్చిన సౌవీరరాజు కాల వర్మను అతడెందుకు క్షమించి వదిలే శాడు? కత్తి దూసి కాలవర్మతో ద్వంద్వ యుద్ధం చేసిన శరణాగతుడు, కోరినా, గజదొంగ నాగభైరవుడి విషయంలో అలా ఎందుకు చేయలేదు? పులివాతపడకుండా తనను కాపాడాడన్న కృతజ్ఞత లేకుండా, వాణ్ణి కారాగారంలో ఎందుకు వేయించి

సట్టు? మాంత్రికుడైన కపాలకంతుణ్ణి చాటుగా చంపినరాజును, యక్షిణీదేవి మహావీరా అనడంలో, ఏదైనా నిగూఢ రహస్యం వున్నదా? ఈ సందేహానికి సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీతల పగిలిపోతుంది.'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''శరణాగతుడి ప్రవర్తన అంతా, రాజనీతికి సంబంధించినది. ఇందులో వ్యక్తిగతమైన పేరు ప్రతిష్ఠలకు తావులేదు. ఏవిధంగానైనా సరే, తన రాజ్యాన్ని సంరక్షించుకోవడం, రాజు బాధ్యత. అందువల్లనే, శరణాగతుడు, కాలవర్మతో ద్వంద్వయుద్ధం చేశాడు. ఓడిన కాలవర్మను బంధిస్తే, అతడి మిత్రులు కొందరు వైశాలీ రాజ్యంపై దాడిచేసే ప్రమాదం వున్నది. కాలవర్మను స్వేచ్ఛగా వదలడంవల్ల, మిగతా రాజులు శరణాగతుడి ఉదార స్వభావాన్ని మెచ్చుకున్నారు.

రాజంతవాడికి, ఒక దొంగతో స్వయంగా కత్తియుద్ధం చేయవలసిన అవసరంలేదు. అలా చేయడం అంటే, తనను తాను కించపరుచుకోవడమే అవుతుంది. ధనం కోసం అనేకమంది ప్రజల ప్రాణాలు తీసిన నాగభైరవుడికి, వాడెవడో తెలియని పరిస్థితిలో, ఒక ప్రాణిని కాపాడినంత మాత్రాన కృతజ్ఞత తెలపడం అంటే—దొంగకు, ప్రభువుస్థానం కట్టబెట్టినట్టవుతుంది. మాయావులూ, మంత్రగాళ్ళూ అయిన వాళ్ళముందు మనిషి వీరత్వం గుడ్డి గవ్వకు కొరగాదు. అందుకే, శరణాగతుడు చాటుగా వుండి కపాలకంతుణ్ణి చంపాడు. అలాంటి మాంత్రికుణ్ణి చంపబూనడమే గొప్ప వీరత్వం. అందుకే, యక్షిణీదేవి, శరణాగతుణ్ణి మహావీరా అన్నది. ఏవిధంగా ఆలోచించినా, శరణాగతుడికి లభించిన పేరు ప్రతిష్ఠలు సులభ మార్గాన మాత్రం లభించినవి కాదు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# వారసుడు

శిళ్ళంగేరిదేశాన్ని పరిపాలిస్తున్న ధర్మ నందన మహారాజుకు, ఇద్దరు భార్యలు. పెద్ద భార్య పేరు సువర్ణాదేవి. చిన్న భార్య పేరు తేజోవతి. సువర్ణాదేవికి, విజయసేను డనే కుమారుడూ, తేజోవతికి, సత్యసేను డనే కుమారుడూ వున్నారు.

రాజు ధర్మనందనుడికి వృద్ధాప్యదశ రావడంతో, రాజ్యపరిపాలనను, తన కుమారులలో ఒకరికి ఒప్పచెప్పాలను కున్నాడు. అయితే, ఇక్కడ ఆయనకొక సమస్య ఎదురైంది. పెద్దరాణి కొడుకు విజయసేనుడికన్న, చిన్నరాణి కొడుకు సత్యసేనుడు వయసులో పెద్దవాడు. ఇద్దరికీ రాజ్యాన్నేలేందుకు సమానమైన శక్తిసామర్థ్యాలున్నవి.

పెద్దరాణి తన కుమారుడు వయసులో చిన్నవాడైనా, పెద్దరాణి కుమారుడు గనక, అతడికే పట్టం కట్టాలని పట్టుపట్టింది. అలాగే చిన్నరాణి, వయసులో పెద్దవాడు గనక, రాజ్యం తన కుమారుడికి చెందాలని పంతం పట్టింది.

రాజుకు, ఏ రాణి మనస్సునూ నొప్పించడం యిష్టం లేదు. కాని, ఆయనకు పెద్దరాణి కుమారుడైన విజయసేనుడంటే ప్రేమ ఎక్కువ. మంత్రి విద్యాసాగరుడికి ఆయన, యీ క్లిష్టసమస్యకు, అందరికీ అంగీకారమైన ఒక పరిష్కారమార్గం ఆలోచించమని చెప్పి, తనకు విజయసేను డంటే ఎక్కువ మక్కువ అని తెలియ పరిచాడు.

శిళ్ళంగేరిదేశానికి పొరుగుదేశమైన గంగాపురాన్ని, అమరేంద్రుడనే రాజు పాలిస్తున్నాడు. ఈయన తేజోవతికి సోదరుడు. సంతానం లేదు. అందువల్ల, తేజోవతి కుమారుడైన సత్యసేనుణ్ణి దత్తత చేసుకుని, అతడికి రాజ్యం అప్పగించి,

కోలార్ కృష్ణ అయ్యర్

తాను విశ్రాంతి తీసుకోవాలనుకున్నాడు. అంతేకాక, ఆయనకు సత్యసేనుణ్ణి శిళ్ళంగేరికి రాజును చేయాలన్న ఆలోచన కూడా వున్నది.

శిళ్ళంగేరితోపాటు, కొన్ని ఇరుగు పొరుగు దేశాలకు కూడా ధర్మ, న్యాయ విషయాలలో దేశికాచార్యులు అనే పండితుడు సలహాలిస్తూండేవాడు. ఆయన న్యాయశాస్త్ర నిపుణుడు. ఆయన న్యాయ నిర్ణయాన్ని అందరూ అంగీకరించేవారు.

అమరేంద్రుడు, దేశికాచార్యులను ఆహ్వానించి, సత్యసేనుడికి శిళ్ళంగేరి రాజ్యసింహాసనానికి గల అర్హతను గురించి అడిగాడు.

అందుకు దేశికాచార్యులు, "సత్యసేనుడు చిన్నరాణి కుమారుడైనా, వయసులో పెద్దరాణి కుమారుడికన్న పెద్దవాడు గనక, అతడికే సింహాసనార్హత ఎక్కువ. అయినా, యిది చాలా క్లిష్టసమస్య. ఆలోచించి తర్వాత చెబుతాను," అన్నాడు.

ఈ సంగతి విన్న శిళ్ళంగేరి మంత్రి విద్యాసాగరుడు, అమరేంద్రుడి వద్దకు వెళ్ళి, "మహారాజా, మీకు, మీ చెల్లెలి కుమారుణ్ణి శిళ్ళంగేరికి రాజును చేయాలన్న కోర్కె వున్నట్టు తెలిసింది. అందువల్ల, పెద్దరాణిగారి కుమారుడైన విజయసేనుణ్ణి దత్తతచేసుకుని, మీ రాజ్యానికి



వారసుణ్ణి చేయండి. మీ రాజ్యం శిళ్ళంగేరి రాజ్యంకన్న చిన్నదైనా, మేము పెద్ద రాణిగారికి, శిళ్ళంగేరిపై తన కుమారుడికి గల హక్కును వదులుకోమని నచ్చ చెబుతాము," అన్నాడు.

కాని ఇందుకు అమరేంద్రుడు అంగీకరించక, "ఇది సాధ్యపడదు. నాకు ఆత్మబంధువైనవాణ్ణి దత్తత చేసుకుని, రాజ్యం వాడికి అప్పగిస్తాను. శిళ్ళంగేరి రాజ్యం విషయంలో మీరు న్యాయం, ధర్మం తర్కించి ఒక నిర్ణయానికి రండి," అని జవాబిచ్చాడు.

ఆ తర్వాత అమరేంద్రుడు యిక కాలహరణం చేస్తే, విజయసేనుణ్ణి దత్తత

చేసుకోమని తనపై మరింత వత్తిడి తెస్తారని భయపడి, ధర్మనందనుడి వద్దకు వెళ్ళి, సత్యసేనుణ్ణి తనకు దత్తుయివ్వమని కోరాడు.

ధర్మనందనుడు, తన మంత్రి విద్యాసాగరుడి సలహా అడిగాడు.

"మహారాజా, ఈ దత్తుకు మీరు వెంటనే అంగీకరించండి. ఇందుకొక మంచి కారణమే వున్నది," అన్నాడు విద్యాసాగరుడు.

ధర్మనందనుడు తన అంగీకారం చెప్పగానే, అమరేంద్రుడు, సత్యసేనుణ్ణి శాస్త్రయుక్తంగా దత్తు చేసుకుని, తన దేశానికి అతణ్ణి యువరాజుగా పట్టాభిషేకం చేశాడు.

కొద్దిరోజుల తర్వాత ధర్మనందనుడూ, ఇద్దరు రాణులూ, అమరేంద్రుడూ ఆహ్వానం పంపి దేశికాచార్యులను పిలిపించారు. మంత్రి, ఆయనతో, "స్వామీ, శిళ్ళంగేరి దేశానికి యువరాజును నిర్ణయించవలసి వున్నది. ఈ క్లిష్టమైన సమస్యను న్యాయ, ధర్మాలు ఆలోచించి తమరే పరిష్కరించాలి," అన్నాడు.

ఇది విన్న దేశికాచార్యులు చిరునవ్వు నవ్వి, "మొదట్లో, ఈ సమస్య క్లిష్టంగా వున్నమాట నిజమే! కానీ సత్యసేనుణ్ణి, అమరేంద్రుడు దత్తత స్వీకరించిన తర్వాత, సమస్య సులభంగా పరిష్కారమై పోయింది. సత్యసేనుడు దత్తు వెళ్ళడంతో అతడు తన కన్నతండ్రి వారసత్వం, కుమారుడుగా అన్నిహక్కులూ పోగొట్టుకున్నాడు. కనుక ఇప్పుడు శిళ్ళంగేరి దేశానికి వారసుడు విజయసేనుడే. ఇందులో ఎలాంటి సందేహాలకూ తావులేదు," అన్నాడు.

దేశికాచార్యులు చెప్పినదానికి, అందరూ ఒప్పుకోకతప్పలేదు. అమరేంద్రుడికి తాను దురాశవల్ల చేసిన పొరబాటు ఇప్పుడర్థమైంది. విజయసేనుణ్ణి దత్తు చేసుకునివుంటే—చాలా పెద్దదైన శిళ్ళంగేరి రాజ్యానికి, తన మేనల్లుడైన సత్యసేనుడు రాజై వుండేవాడు!



# చందమామ అనుబంధం—10

# మన విజ్ఞాన సంపద

## మహనీయులు:



### జహాంగీర్

జహాంగీర్‌గా పేరుగాంచిన, అక్బరుచక్రవర్తి జ్యేష్ఠ కుమారుడు సలీంమీర్జా 1569 వ సం॥ ఆగస్టు 30 వ తేదీన జన్మించాడు. అతని తల్లి రాజపుత్రవనిత. 1601 వ సం॥ అతడు, తండ్రి మీద తిరుగుబాటు జరిపాడు. అయినా అది విజయవంతం కాలేదు. విశాల హృదయుడయిన తండ్రి అతన్ని క్షమించాడు. అయినా, తన కుమారుడు ఖుస్రూ తిరుగుబాటు జరిపినప్పుడు, అతన్ని బంధించి చెరసాలలో పెట్టాడు. యువరాజు అక్కడే 1622 వ సం॥ మరణించాడు. జహాంగీర్ కాలంలోనే, బ్రిటిష్ రాయబారులు కేప్టన్ హాకిన్స్, సర్ థామస్‌రో మొగలు ఆస్థానానికి విచ్చేసి, భారతదేశంతో వర్తకవ్యాపారాలకు నాంది పలికారు. జహాంగీర్ కళాభిమాని. మత సంబంధమైన విషయాలలో సహనం కనబరిచాడు. కుమారుడు షాజహాన్ అతని మీద తిరుగుబాటు చేశాడు. ఆ తరవాత, సైన్యాధిపతి మహాబత్ ఖాన్ కూడా తిరుగుబాటుచేసి, జహాంగీర్‌ను కొంత కాలం కారాగారంలో ఉంచాడు. అయినప్పటికీ, జహాంగీర్ రాణి నూర్జహాన్, చాకచక్యంతో ఆయన విడుదలయ్యేట్టు చేసింది. 1626 వ సంవత్సరం ఆయన మరణించాడు.

## ఎవరాయన?

ఒక యువరాజూ, బ్రాహ్మణకుర్రవాడూ కలిసి ఒక గురుకులంలో విద్యనభ్యసించారు. గురువు వద్ద సకలవిద్యలను నేర్చుకోవడంతోపాటు ఇద్దరూ అన్యోన్యంగా కలిసిమెలిసి ఉండేవారు. ఒకనాడు యువరాజు తన మిత్రుడితో, "నేను రాజునయ్యానంటే, ఆపైన నీకు ఏ లోటూ వుండదు. కావాలంటే నా రాజ్యంలో సగభాగం నీకివ్వగలను," అన్నాడు.

విద్యాభ్యాసం పూర్తి అయ్యాక ఇద్దరూ విడిపోయారు. కొన్నేళ్ళు గడిచాయి. బ్రాహ్మణుడికి కుటుంబ భారం పెరిగింది. పేదరికంతో బాధపడసాగాడు. అప్పుడతనికి తన బాల్యమిత్రుడి మాటలు జ్ఞాపకం వచ్చాయి. అతడు కొండంత ఆశతో, రాజుగా వున్న తన బాల్యమిత్రుడి దగ్గరికి వెళ్ళి, 'మిత్రమా!' అని సంబోధించి పరిస్థితి వివరించాడు. కాని, రాజు హేళనగా నవ్వి, "రాజుకూ, కటికదరిద్రుడికీ మధ్య స్నేహమా!" అని పరిహసించాడు. బ్రాహ్మణుడు అవమాన భారంతో తిరిగి వెళ్ళి, పంతంపట్టి, రాజును అవమానించాడు. అయినా, అవమానించబడిన రాజు, మళ్ళీ బ్రాహ్మణుడి మీద పగసాధించాడు.

(అ) ఈ కథలోని బ్రాహ్మణుడెవరు?

(ఆ) రాజు ఎవరు? ( **36** పేజీ చూడండి)

# మహోన్నత

## భారతదేశం: నాడు - నేడు

ఉత్తరాన మహోన్నత హిమాలయాలు, దక్షిణాన హిందూమహాసముద్రం, తూర్పున బంగాళాఖాతం, పడమర అరేబియా సముద్రం సరిహద్దులుగా కలిగిన మన సువిశాల భారత దేశం ఒక ఉపఖండం!

మన దేశం ఎంత ప్రాచీనమైనది? మన భూగోళమంత ప్రాచీనమైనదని సులభంగా చెప్పవచ్చు. కాని, ఇది సరైన సమాధానం కాదు. ఎందుకంటే దేశమంటే కేవలం మట్టి కాదు. భారతదేశం అంటే అది భారతీయ నాగరికతనూ, సంస్కృతినీ సూచిస్తుంది. ప్రాచీన భారతీయ నాగరికతా విశేషాలు మనకు అంతగా తెలియవు. అందుకే మన నాగరికత క్రీ. పూ. ఐదువేల సంవత్సరాలకు పూర్వమే వెలసిందని కొందరంటే—కాదు, ఇంకా ప్రాచీన మైనదని మరి కొందరు వాదిస్తారు!

అయితే, ఒకటి మాత్రం కాదనలేని సత్యం. ప్రపంచంలో మరే దేశానికీ లేనటువంటి అతి ప్రాచీనమైన సాహితీ సంపద, తాత్విక ఆలోచనల స్రవంతి మన దేశానికి ఉన్నది. ప్రపంచంలోనే ప్రప్రథమ జ్ఞానసూక్తులు వేదాలు; ప్రాచీనమైన గొప్ప ఇతిహాసాలు రామాయణ మహా భారతాలు; మొట్టమొదటి కథల సంకలనం కథాసరిత్సాగరం; మొట్టమొదటి జంతువుల కథలు పంచతంత్రం; మొట్టమొదటి నీతికథలు జాతక కథలు—ఈ భూమి మీదనే వికసించాయి. మహోన్నతమైన తాత్విక ధోరణులు—దర్శనాలు ఇక్కడే ఆవిర్భవించి, అభివృద్ధి చెందాయి!



# భరతవర్షం



భారతదేశం అసలు పేరు భరతవర్షం. భరతుడనే రాజు పాలించడంవల్ల ఆ పేరు ఏర్పడింది. బహుశా, ఆయన వివిధ రాజ్యాలను తన ఏకచ్ఛత్రాధిపత్యం కిందికి తెచ్చి ఉంటాడు.

సింధునది ప్రవహించే శం గనుక దీనిని పారశీకులు 'హింద్' అన్నారు. 'హింద్' నుంచి ఇండియా అనే మాట ఏర్పడింది. ప్రాచీన భారతదేశంతో వర్తకవ్యాపారాలు జరిపిన పారశీకులూ, గ్రీకులూ 'హింద్' అనే మాటను భారతీయుడు (ఇండియన్) అనే అర్థంలోనే వ్యవహరించారు. ఈ పదం మతసంబంధమైనది కాదు.

ప్రాచీన కాలంలో అనేక రాజ్యాలు వెలసినప్పటికీ మనది ఒకే దేశం! ఎందుకంటే ఆ రాజ్యాలన్నీ ఒకే విధమైన సంస్కృతీ సాహిత్య సంప్రదాయాలు కలిగి వుండేవి!

దురదృష్టవశాత్తు 1947 వ సంవత్సరం భారతదేశంలో కొంతభాగం పాకిస్థాన్‌గా విడిపోయింది. ఆ 'కొత్త' దేశం నుంచి మూడో దేశం 'బంగ్లాదేశ్' పుట్టుకొచ్చింది!

పురాతన భరతవర్షంలో, ఈనాటి అప్ఘనిస్థాన్ కూడా ఒక భాగంగా వుండేది! శ్రీలంక, మలయా, కంబోడియా, ఇండొనేషియా, చైనా మొదలైన దేశాలను భారతీయ సంస్కృతి ఎంతగానో ప్రభావితం చేసింది.

మన దేశ భౌగోళికపటం పెద్దదే. కాని, భారతీయ సాంస్కృతికపటం అంతకన్నా పెద్దది, సువిశాలమైనది!




1. పాశ్చాత్య ప్రపంచానికి, ప్రప్రథమంగా చైనాను గురించి వివరంగా తెలియజేసినవారు ఎవరు?
2. ఒక రచయిత, గణితశాస్త్రంలో చాలా ప్రసిద్ధిగాంచిన గ్రంథం రచించాడు. కాని, ఆయనకు సాహిత్యానికి నోబెల్ బహుమతి లభించింది. ఆయన ఎవరు?
3. తాబేలు తలమీద పడడంవల్ల ప్రాణం కోల్పోయిన గొప్ప నాటకకర్త ఎవరు?
4. ప్రసిద్ధిగాంచిన ఒక నవల కథావస్తువు, రచయితకు స్వప్నం ద్వారా స్ఫురించింది. ఆ రచయిత ఎవరు? నవల పేరేమిటి?
5. మన వాల్మీకి, వ్యాసులకు సాటిగా పేర్కొనబడే పాశ్చాత్య మహాకవి ఎవరు?
6. ఆయన రచించిన గ్రంథాల పేరేమిటి?
7. ఆయన తన రచనతో అమరత్వం ప్రసాదించిన నగరం పేరేమిటి?
8. ఆయన మొదటి గ్రంథంలో కథానాయిక ఎవరు?
9. ఆయన రెండవ గ్రంథం కథానాయకుడు ఎవరు?
10. ఆ మహాకవి ఎప్పుడు ఎక్కడ నివసించాడు?

(VIII పేజీ చూడండి)

## సమాధానాలు

### ఎవరాయన?

(అ) ద్రోణుడు. (ఆ) ద్రుపదుడు.

### సాహిత్యం

1. మార్కోపోలో
2. బెర్ట్రెండ్ రస్సెల్. ఆయన ప్రసిద్ధ గ్రంథం 'ప్రిన్సిపియా మేథమెటికా.'
3. గ్రీకునాటకకర్త ఏస్కిలస్. ఎగురుతూన్న డేగ పిడికిలి నుంచి తాబేలు జారి ఆయన తలపై పడింది.
4. రాబర్ట్ లూయిస్ స్టీవెన్సన్. డాక్టర్ జెకిల్ అండ్ మిస్టర్ హైడ్.
5. హోమర్.
6. ఇలియడ్, ఒడిస్సీ
7. ట్రాయ్.
8. హెలెన్
9. యులిసెస్
10. బహుశా క్రీ. పూ. 9వ శతాబ్దంలో గ్రీసులో.



# నెహ్రూకథ–8

**1926** వ సం॥ మార్చినెలలో, జవహర్‌లాల్ అనారోగ్యంగా వున్న తన భార్య కమలను, స్విట్జర్లాండుకు తీసుకు వెళ్ళాడు. వాళ్ళతోపాటు చిన్నారి ఇందిర కూడా వెళ్ళింది. వాతావరణం మార్పు వల్ల, కమలానెహ్రూ ఆరోగ్యం మెరుగు పడింది.

యూరపులో వున్నప్పుడు జవహర్లాల్‌కు, అక్కడ ప్రవాసంలో వున్న శ్యాంజీ కృష్ణవీర, రాజా మహేంద్రప్రతాప్, మేడమ్ కామా మొదలైన పలువురు భారతీయ విప్లవవాదులను కలుసుకునే అవకాశం కలిగింది.






**1927** వ సం॥ మోతీలాల్ నెహ్రూ యూరపుకు వెళ్ళి, జవహర్‌లాల్‌ను కలుసుకున్నాడు. కుటుంబం అందరూ కలిసి, మాస్కో వెళ్ళారు. రష్యా, జార్ అధికారాన్ని అంతమొందించిసోవియట్ యూనియన్‌గా ఆవిర్భవించిన దశమ వార్షికోత్సవంలో పాల్గొన్నారు. అది ఎంతో ప్రయోజనకరమైన ప్రయాణం.



1927 వ సం॥ అంతంలో మద్రాసులో కాంగ్రెస్ మహాసభ జరిగేలోగా జవహర్‌లాల్ స్వదేశానికి తిరిగి వచ్చాడు. ఆయన కాంగ్రెస్ కార్యదర్శిగా, మహాసభలో భారతదేశస్వాతంత్ర్యం కావాలన్న తీర్మానాన్ని ప్రతిపాదించాడు.

ఆ సంవత్సరమే, రాజ్యాంగం పనిచేసే తీరుతెన్నులను పరిశీలించడానికి, సర్ జాన్‌సైమన్ అధ్యక్షతలో బ్రిటిష్ ప్రభుత్వం మన దేశానికి ఒక కమిటీని పంపింది. ఆ కమిటీలో కొందరు భారతీయులకు కూడా స్థానం కల్పించాలని కాంగ్రెస్ కోరింది. అయినా, ప్రభుత్వం ఆంగ్లేయులను మాత్రమే సభ్యులుగా నిర్ణయించింది.






అందువల్ల సైమన్‌కమిషన్‌ను బహిష్కరించాలని కాంగ్రెస్ తీర్మానించింది. కమిషన్ వెళ్ళినచోటల్లా, భారతీయులు నల్లజెండాలు చూపారు. 'సైమన్, తిరిగిపో!' అని నినాదాలు చేశారు!

లాహోర్‌లో జరిగిన సైమన్ కమిషన్ వ్యతిరేక ఉద్యమానికి లాలా లజపతి రాయ్ అధ్యక్షత వహించాడు. యువకుడైన ఒక ఆంగ్లేయాధికారి, లాలాజీని లాఠీతో రొమ్ము మీద కొట్టాడు. ఆయన కింద పడిపోయాడు!





లాలా లజపతిరాయ్ భారత ప్రజల గౌరవాదరాలకు పాత్రుడైన గొప్ప నాయకుడు. ఆయనపై, ప్రభుత్వం తలపెట్టిన దురాగతానికి ప్రజలు ఆగ్రహం చెందారు. ఆయన కొన్ని వారాల తరవాత మరణించాడు. దెబ్బల కారణంగానే ఆయన మరణించాడని చాలామంది భావించారు. గాయపడిన రోజు ఏర్పడిన అదురు పాటు కారణంగానే లాలాజీ తొందరగా మరణించాడని జవహర్‌లాల్ అనుకున్నాడు.

ఊరేగింపులను నిషేధిస్తూ ప్రభుత్వం జారీ చేసిన ఆజ్ఞలకు వ్యతిరేకంగా జవహర్‌లాల్ లక్నోలో ఒక ప్రదర్శన ఏర్పాటు చేశాడు. పోలీసులు ఆయనను రెండుసార్లు వీపుపై కొట్టారు.





మరునాడే సైమన్ కమిషన్ లక్నో నగరానికి వచ్చింది. ధానికి వ్యతిరేకంగా, జవహర్‌లాల్ పెద్ద ప్రదర్శన ఏర్పాటు చేశాడు. శాంతియుతంగా ప్రదర్శన జరిపిన ప్రజలను, గుర్రాలపై వచ్చిన పోలీసులు కన్నూమిన్నూ తెలియకుండా బాదారు.

జవహర్‌లాల్ ఆ సమయంలో మళ్ళీ దెబ్బలు తిన్నాడు. ఆయన వద్దంటున్నా మిత్రులు ఆయన్ను దూరంగా మోసుకు వెళ్ళారు. బ్రిటిష్ పోలీసుల దురాగతాలు ఆదుపూ, ఆజ్ఞా లేకుండా మితిమించి పోసాగాయి.





పంజాబు మహానాయకుడు లాలాలజపతి రాయ్ మరణం, పరాయి ప్రభుత్వం హద్దుమీరినదురాగతాలు, భగత్‌సింగ్‌ను ఆంగ్లేయులకు ఎదురుతిరిగే విధంగా చేశాయి. భగత్‌సింగ్ ప్రాణత్యాగం చేశాడు. —(ఇంకావుంది)



# దురాశాపరుడు

భువనేశ్వరం అనే ఒక పెద్ద గ్రామంలో సహదేవుడూ, మహదేవుడూ అని ఇద్దరన్నదమ్ము లుండేవారు. వాళ్ళిద్దరూ వైద్యులే. సహదేవుడు తన దగ్గరకు వచ్చే రోగులకు, డబ్బు మాట ఎత్తకుండా ముందు వైద్యం చేసి, వాళ్ళ తాహతును బట్టి యిచ్చేదానితో తృప్తిపడేవాడు. మహదేవుడు ఇందుకు భిన్నంగా, రోగులిచ్చే డబ్బునుబట్టి వైద్యం చేసేవాడు.

ఇందువల్ల సహదేవుడికి పేరూ ప్రతిష్ఠలతోపాటు, క్రమంగా రాబడి కూడా పెరిగింది. మహదేవుడికి మాత్రం, వచ్చే రోగుల సంఖ్య తగ్గి రాబడి పూర్తిగా పడిపోయింది.

ఈ స్థితిలో మహదేవుడి భార్య భర్తతో, ''అలా గోళ్ళు గిల్లుకుంటూ ఇంట్లో కూర్చోవడం దేనికీ? సంపాదించడానికి మరేదైనా మార్గం చూడు. చేతకాకపోతే, ఏ చెట్టుకైనా ఉరిపోసుకుంటే సరిపోతుంది!'' అంటూ రోజూ సాధించడం ప్రారంభించింది.

భార్య సాధింపులతో విసిగిపోయి, మహదేవుడు ఇల్లువిడిచి బయలుదేరాడు. అతడు ఎక్కడెక్కడో తిరిగి, సంపాదించడం చేతకాక విరక్తిచెంది అరణ్యంలోకి వెళ్ళాడు. అక్కడ కొన్ని అడవితీగలను ఒక చెట్టుకొమ్మకు కట్టి, ఉరిపోసుకోబోయాడు.

ఆ సమయంలో, దాపులనున్న గుహ నుంచి బయటికొచ్చిన రాక్షసుడొకడు, మహదేవుణ్ణి చూసి, "ఒరే, నరమానవా! ఏమిటి నువ్వు చెయ్యబోయే తమాషా?'' అని అడిగాడు.

రాక్షసుడు ఇలా అడిగేసరికి, వాడంటే భయం పోయి, మహదేవుడికి ఒక దురాలోచన కలిగింది. రాక్షసుల దగ్గిర నిధి నిక్షేపాలుంటాయని జనం చెప్పుకుంటారు.

మల్లవరపు మనోహరరెడ్డి



ఈ రాక్షసుణ్ణి ఏదోవిధంగా మోసగించి, వాడి దగ్గరున్న ధనాన్ని కాజేయాలనుకున్నాడు, మహదేవుడు.

రాక్షసుడు తనను సమీపించగానే మహదేవుడు, "నేనేం తమాషా చేయబోవడంలేదు. ఇలా అడవి తీగలతో గొంతు బిగించుకుని, గాల్లో వేళ్ళాడితే, చనిపోయిన మన తాతముత్తాతలు కనిపిస్తారు," అన్నాడు.

ఇందుకు రాక్షసుడు ఆశ్చర్యపోతూ, "ఆహాఁ, అయితే నువ్వు కాస్త తప్పుకో! మా తాతను చూసి చాలా కాలమైంది," అంటూ, అడవితీగలు గొంతుకు బిగించుకుని గాల్లో వేళ్ళాడాడు.

రాక్షసుడు స్థూలకాయుడు కావడం వల్ల, చెట్టుకొమ్మ పెళపెళమంటూ విరిగి, అంత ఎత్తునుంచి వాడు నేలమీదపడ్డాడు. ఆ దెబ్బకు వాడి శరీరం నిండా గాయాలయి లేవలేని స్థితికి వచ్చాడు. అయితే, వాడు జరిగిన మోసం వెంటనే గ్రహించి, పట్టరాని ఆగ్రహంతో అందుబాటులో వున్న రాళ్ళురప్పల్ని తీసి మహదేవుడి కేసి విసరసాగాడు.

రాక్షసుణ్ణి మోసగించబోయి, తానే చిక్కులోపడిన మహదేవుడు, రాళ్ళ దెబ్బలనుంచి తప్పుకునేందుకు ముళ్ళ పొదలమీద పడిలేస్తూ, నేలబారుగావున్న చెట్లకొమ్మల్లో చిక్కుకుని ఎలాగో బయట పడుతూ, ఒళ్ళంతా గాయాలతో ఇల్లు చేరాడు.

ధనసంపాదనకంటూ పోయి, ఒంటి నిండా గాయాలతో తిరిగివచ్చిన మహదేవుణ్ణి చూసి, అతడి భార్య సంగతేమిటని అడిగింది. మహదేవుడు జరిగినదేమిటో చెప్పాడు.

మహదేవుడి భార్య చెప్పలేనంతగా ఆనందపడిపోతూ, "ఇది మన మంచికే జరిగింది!" అన్నది.

మహదేవుడు తెల్లబోయి, "మన మంచికా! నీకు పైత్యంగాని ప్రకోపించిందా?" అన్నాడు.

"మీ దగ్గరకు రోగులు రాకపోవడానికి కారణం, మీ అన్న! చూస్తూండండి, ఆయన పీడ విరగడ చేస్తాను," అన్నది మహాదేవుడి భార్య.

తర్వాత ఆమె, సహదేవుడి ఇంటికి వెళ్ళి, "అక్కా, మీ మరిదికి అరణ్యంలో రాక్షసుడొకడు కనిపించి, ఒక గోతాం నిండుగా బంగారు కాసు లిచ్చాడు. వాటిని లెక్కబెట్టడం శ్రమ. కాస్త సోలయివ్వు." అని సహదేవుడి భార్యను అడిగింది.

సహదేవుడి భార్యకు, ఆమె మాటల్లో నమ్మకం కుదరక, సోల అడుగున కాస్త చింతపండు పెట్టి తెచ్చి యిచ్చింది.

మహాదేవుడి భార్య సోల ఇంటికి తీసుకుపోయి, దాని అడుగున చింతపండు వుండడం చూసి, తన ఎత్తుపారినందుకు సంతోషించింది. బంగారంకోసం సహదేవుడు రాక్షసుడి దగ్గరకు వెళతాడనీ, అప్పుడు కోపంలోవున్న రాక్షసుడు సహదేవుణ్ణి చంపితినేస్తాడనీ ఆమె అనుకున్నది.

ఆ ప్రకారం మహాదేవుడి భార్య ఎప్పుడో దాచివుంచిన బంగారు కాసునొకదాన్ని సోల అడుగున వున్న చింతపండుకు అంటించి, దాన్ని తీసుకుపోయి సహదేవుడి భార్యకిచ్చింది.

సోల అడుగునవున్న బంగారు కాసును చూసి, సహదేవుడి భార్య, భర్తతో, "మీ తమ్ముడికి రాక్షసుడు బంగారు కాసు లిచ్చిన మాట నిజమే! మీరూ వెళ్ళి



తీసుకురండి. వాడు చాలా మంచి రాక్షసుడిలా వున్నాడు. వాడిచ్చే బంగారంతో మీరు గ్రామంలో మంచి వైద్యశాల కట్టించి, రోగులకు ఉచితంగా వైద్యం చేయవచ్చు," అన్నది.

సహదేవుడికి, భార్య సలహా నచ్చింది. అతడు బయలుదేరి అరణ్యంలో కొంత దూరం వెళ్ళేసరికి, రాక్షసుడు ఒకచోట ఒంటినిండా గాయాలతో మూలుగుతూ కనిపించాడు.

సహదేవుడు, వాణ్ణి సమీపించి, "నేను వైద్యుణ్ణి. నీకెలాంటి ప్రాణభయం లేదు. చికిత్స చేసి, నీ గాయాలు మానేలా చేస్తాను," అన్నాడు.

రాక్షసుడు దీనంగా సహదేవుడికేసి చూశాడు.

దానితో అతడు అరణ్యంలో ఏం జరిగివుంటుందో గ్రహించాడు. తన మరదలు తనకు హానితలపెట్టి, రాక్షసుడు తన భర్తకు బంగారం యిచ్చాడని కట్టు కథ చెప్పింది!

ఆ తర్వాత సహదేవుడు వారంరోజుల పాటు రాక్షసుడికి మూలికలతో, ఆకుపసర్లతో వైద్యం చేసి, గాయాలు నయమయేలా చేశాడు.

రాక్షసుడు, సహదేవుడికి తన కృతజ్ఞత చెప్పుకుని, గుహలోనుంచి ఒక పెద్ద సంచీ నిండుగా బంగారుకాసులు తెచ్చి, అతడికిచ్చాడు.

గ్రామానికి తిరిగివచ్చిన సహదేవుడు, తమ్ముణ్ణి కలుసుకుని, "ఒరే, మహదేవా, దురాశ దుఃఖం చేటన్నారు పెద్దలు. అయినా జరిగిందేదో జరిగిపోయింది. దిగులుపడకు," అని, రాక్షసుడిచ్చిన బంగారుకాసుల సంగతి వివరంగా చెప్పాడు.

తర్వాత అన్నదమ్ములు గ్రామంలో ఒక వైద్యశాల స్థాపించి, ఉన్నవారి నుంచివారిశక్తినిబట్టిడబ్బుతీసుకుంటూ, పేదలకు ఉచితంగా వైద్యం చేస్తూ, ప్రజల నుంచి ఎంతో గౌరవమర్యాదలు సంపాయించుకున్నారు.





# కృష్ణావతారం

బలికుమారుడు బాణాసురుడు. అతని రాజధాని శోణపురం. వెయ్యి చేతులు గల బాణుడు చిన్నతనంలో తెగ తిరిగాడు. ఒకనాడు అతను, మణులతోనూ, బంగారంతోనూ ప్రకాశించే కుబేర పర్వతపు గుహలో కుమారస్వామి ఆటలలో మునిగి ఉండటమూ, శివపార్వతులు వినోదించుతూ ఉండటమూ చూశాడు.

కుమారస్వామి ఆరు ముఖాలూ, చేతులూ, శరీరచ్ఛాయా, తేజస్సూ చూసి బాణుడు, "ఈ కుర్రవాడు ఏ తపస్సు చేసి శివుడికి కొడుకై జన్మించాడో గదా! నేను కూడా అలాగే తపస్సుచేసి ఈ మహా దృష్టాన్ని సాధించాలి," అనుకున్నాడు. అలా అనుకున్న బాణుడు ఏకాగ్రభక్తితో అనేక సంవత్సరాలపాటు నిష్ఠగా శివుణ్ణి ఆరాధించాడు. శివుడు అతని ఆరాధనకు సంతోషించి, పార్వతీ సమేతుడై బాణుడి ఎదట ప్రత్యక్షమై, చిరునవ్వు నవ్వుతూ, "నాయనా, నీ ఇష్టం వచ్చిన వరం కోరుకో, ఇస్తాను," అన్నాడు.

బాణుడు చేతులు మోడ్చి, "దేవా, నే నీ దేవికి కొడుకునై, నీ అనుగ్రహానికి పాత్రుణ్ణి అయేటట్టు వరం ఇయ్యి," అని అడిగాడు.

శివుడు సరేనని, పార్వతిని చూసి, "దేవీ, వీడు బాణుడు, నీ చిన్నకొడుకు. కుమారస్వామికి రెండోవాడు. వీణ్ణి గ్రహించు," అన్నాడు. తరవాత శివుడు బాణుడికి, సమస్త సంపదలతోనూ తుల

24. బాణాసురుడి కథ



తూగే శోణపురాన్ని రాజధానిగా ఇచ్చి, "నీ నగరాన్ని నేను స్వయంగా కాపాడుతూ ఉంటాను. నిన్ను ఎంతటివాడూ జయించ లేడు. అందుచేత నువు నిశ్చింతగా ఉండు," అన్నాడు.

కుమారస్వామి బాణుడికి ఒక దివ్యమైన నెమలిని ఇచ్చి, "ఈ నెమలే నీకు వాహనమూ, పతాక కూడా అయి ఉంటుంది," అని చెప్పాడు.

ఇక బాణుడికి ఎవరి భయమూ లేదు. ఎందుకంటే, శివుడే తనకు రక్ష. అతను విజృంభించి దేవతలనూ, గంధర్వులనూ, నాగులనూ, ఖేచరులనూ, రాక్షసులనూ, సమస్తమైన వారినీ ఒకరి తరవాత ఒకరినిగా జయించి, యుద్ధం చెయ్యాలనే ఆసక్తి తీరక, తనతో యుద్ధం చెయ్యగల వాణ్ణి కానక తపించిపోయాడు.

అనేక సంవత్సరాలు ఇలా గడిచిన మీదట అతని చేతుల తీట దుర్భరమయింది. అతను శివుడి వద్దకు వెళ్ళి, సాష్టాంగపడి, భక్తిగా పూజ చేసి, "దేవా, నాకు యుద్ధం కరువైపోయింది. నా చేత అనేకసార్లు ఓడిపోయిన దేవతలు నా ఎదట పడకుండా ఉన్నారు. నాతో యుద్ధం చెయ్యటానికి సిద్ధంగా ఉన్న శూరుడు మూడు లోకాలలోనూ ఒక్కడైనా కానరాడు. నా చేతులన్నీ వ్యర్థంగా ఉండిపోయాయి. ప్రదర్శించటానికి లేని పరాక్రమం వృధాకదా! నాకు యుద్ధం చేసే అవకాశం ఎలా కలిగేదీ తెలిపి అనుగ్రహించు," అని వేడుకున్నాడు.

శివుడు బాణుణ్ణి చూసి నవ్వి, "నువ్వడిగినది నేను కాదనటం భావ్యం కాదు గద. విను, నీ మయూరధ్వజం ఏ కారణమూ లేకుండా ఒరిగి, పడిపోయినప్పుడు నువు కోరుకుంటున్న యుద్ధం నీకు సన్నిహితమవుతుందనుకో. అప్పుడు నీ బాహుబలానికి తగినటువంటి యుద్ధం సంభవిస్తుంది. విచారించకు," అన్నాడు.

"అమ్మయ్య, బతికిపోయాను," అని బాణుడు శివుడికి మొక్కి, సెలవు తీసు

కుని, తన ఇంట నెమలిధ్వజం ఉన్న చోటికి వెళ్ళి కూర్చుని, సభ చేసి, తన మంత్రి అయిన కుంభాండుడితో, ''ఒక మంచివార్త తెచ్చాను,'' అన్నాడు.

దానికి కుంభాండుడు, ''మంచివార్తలు చాలా ఉంటాయి. అందులో ఇది ఏది? నీకు శివుడు కొత్తవరం ఏదన్నా ఇచ్చాడా? లేకపోతే, ఇంద్రుణ్ణి పాతాళానికి పంపేసి, దేవలోకాన్ని నిన్నే ఏలుకోమన్నాడా? అదీ కాకపోతే, కృష్ణుణ్ణి గెలిచే ఉపాయం గాని చెప్పలేదు గద? అదే జరిగితే ఇంక లేనిదేమిటి? విష్ణుడి చేత మోసపోయి పాతాళం చేరిన పరమ ధర్మాత్ముడు నీ తండ్రికి విముక్తి కలుగుతుంది. ఆయన్ను మళ్లీ చూసి ధన్యులమవుతాం,'' అన్నాడు.

బాణుడు చిన్నగా నవ్వుతూ, ''కాదు, కుంభాండా! యుద్ధాలు లేని కారణం చేత నా చేతులు దురదగా ఉండి, నాకు యుద్ధం చేసే అవకాశం ఎలా కలుగుతుందని శివుణ్ణి వేడుకున్నాను. నా యీ మయూరధ్వజం అకారణంగా ఎప్పుడు పడిపోతే అప్పుడు నాకు తగిన యుద్ధం రాబోతుందనుకోమని ఆ మహాదేవుడు చెప్పాడు. అదే నీకు నేను చెబుదామనుకున్నాను,'' అన్నాడు.

కుంభాండుడు చిన్నబోయి, ''అయ్యో, ఇదేం ప్రారబ్ధం! ఇదా నువు మహాశివుణ్ణి అడిగిన వరం? ప్రహ్లాదుడి కులానికెంత దుస్థితి వచ్చింది!'' అన్నాడు పట్టరాని విచారంతో.





అతనా మాట అంటూండగానే పెళ పెళా రావాలతో మయూరధ్వజం, వజ్రాయుధం దెబ్బతిన్న కొండ లాగా, ఒరిగి పడిపోయి, బాణుడూ, కుంభాండుడూ చూస్తుండగా విరిగిపోయింది. తన కోరిక ఈడేరుతున్నదని బాణుడు పరమానంద భరితుడయాడు. అదే క్షణంలో భూమి కంపించటమూ, ఆకాశాన తోకచుక్క కనబడటమూ, ప్రచండంగా గాలి వీచ టమూ, శోణపురం మీద రక్తవర్షం కురవ టమూ, మొదలైన ఉత్పాతాలు కలిగాయి.

వాటిని చూసి కుంభాండుడు బెదిరి పోయి; తనలో, "మూడు లోకాలనూ గెలిచి, తన ఎదట నిలిచేవాడు లేకుండా చేసుకున్న బాణుడు, గర్వాతిశయం కొద్దీ యుద్ధం వరంగా తెచ్చుకున్నాడు. ఎంత పొరపాటు! ఇది ఇతని నాశనానికే వచ్చింది. ఎంత మంచివాడిలోనైనా రాక్షసి బుద్ధి రాక్షసబుద్దే! ఈ ఉత్పాతాలన్నీ ఊరికే పోతాయా? శివుడూ, కుమారస్వామీ నగరాన్ని రక్షిస్తున్నప్పటికీ వరం మూలాన లభించిన యుద్ధం తప్పదు. అయితే బాణుణ్ణి ఎదిరించి నిలబడగల వాళ్ళు లేరు—దేవతల పరాజయం సహించలేని విష్ణువు తప్ప." అనుకున్నాడు.

బాణుడు మాత్రం నిశ్చింతగానూ, ఉత్సాహంగానూ, సమస్త భోగాలలోనూ మునిగి తేలుతూ, ఏ క్షణంలో నైనా విష్ణువుతోనైనాసరే యుద్ధం చెయ్యటానికి సంసిద్ధుడై ఉన్నాడు.

బాణుడికి ఉష అనే కుమార్తె ఉన్నది. చంద్రుడి కళలే స్త్రీరూపం ధరించాయా అనిపించేటంతటి సౌందర్యవతి. ఆమెకు చెలికత్తె అయిన చిత్రరేఖ కుంభాండుడి కూతురు. తండ్రి ఆదేశించిన మీదట ఉష తనకు తగిన భర్త లభించాలని పార్వతీదేవిని ప్రార్థిస్తూ ఉండేది.

ఇంతలో చైత్రమాసం వచ్చింది. శోణ నగరంలోనే ఉంటున్న శివుడు పార్వతితో కూడా వసంతవిహారాలు చేయ నిశ్చయించి, అనేకమంది అప్సరసలనూ,

గంధర్వస్త్రీలనూ రప్పించాడు. స్త్రీలను పార్వతి రూపాలు ధరించమన్నాడు. ప్రమథగణాలను శివశక్తి రూపాలు ధరించమన్నాడు. అందరూ కలిసి శోణ పురం వెలపల, మందాకినీనది ఒడ్డున గల తోటలలో ఆటలూ, వినోదాలూ, వేడుకలూ సాగించారు. నృత్య గానాలు సాగాయి.



మహా ఉల్లాసంగా సాగే ఈ వినోదాల మధ్య శివపార్వతులను ఉష చూసింది. వెంటనే తనకు వివాహమయ్యే అదృష్టం ఎప్పుడు కలుగుతుందా అని ఆమెకు అనిపించింది. తన కేమి లోటు ? తన తండ్రి మూడు లోకాలూ ఏలేవాడు. చరాచర ప్రపంచాన్ని రక్షించే సాక్షాత్తూ పార్వతీ దేవే తన ఇలవేల్పు. తనకు తగిన భర్తను ప్రసాదించమని తాను పార్వతిని నిత్యమూ భక్తితో ప్రార్థిస్తున్నది. అయినా తన కోరిక ఎందుకు తీరటం లేదు ?

ఈ విధంగా ఉష తన మనస్సులో అనుకోవటం పార్వతి గ్రహించి, చెయ్యి ఊపి ఆమెను తన దగ్గిరికి పిలిచి, ''బాలా, నీ మనసులో ఉన్న ఆలోచన సరి అయినదే. కన్యలు పెళ్ళి కోసం తపించటం తప్పు కాదు. త్వరలోనే నీకు భర్త దొరుకుతాడు. శివుడితో నేను పొందే సౌఖ్యాన్ని నువు కూడా పొందుతావు. అది ఎలా జరిగేదీ చెబుతాను, విను. వచ్చే వైశాఖ శుద్ధద్వాదశి రాత్రి నువు నిద్రపోతూండగా ఒక పురుషుడు కలలో కనిపిస్తాడు. అతనే నీకు కాబోయే భర్త,'' అన్నది.

ఉష సంతోషంతోబాటు సిగ్గుపడుతూ, పార్వతికి మొక్కి అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

పార్వతి చెప్పినట్లే జరిగింది. ఒకనాటి రాత్రి ఉష తన చెలికత్తెలతో సహా మేడ మీద సుఖనిద్రలో ఉండగా ఆమెకు కల వచ్చింది. అందులో ఒక మన్మథాకారుడు ఆమెను సమీపించి, నవ్వుతూ ఆమెను పలకరించి, ఆమె చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు.



సాహసించే వాళ్ళెవరు? నీ తండ్రి బాణుడు కాడా!'' అంటూ కన్నీరు తుడిచి ఓదార్చింది.

ఉష తనకు వచ్చిన కల చెప్పి, అది కల అనటానికి వీల్లేదనీ, తనకు తీరని కళంకం చుట్టుకున్నదనీ అన్నది. అప్పుడు చిత్రరేఖ ఉషకు పార్వతి చెప్పిన మాటలు జ్ఞాపకం చేసి, ''ఇవాళ వైశాఖ శుద్ధ ద్వాదశి. ఈ రాత్రి నీకు కలలో కనిపించినవాడే నీకు భర్త అవుతాడని దేవి చెప్పలేదా? సంతోషించక దిగులుపడతావేమిటి?'' అన్నది.

వెంటనే ఉష ముఖం మబ్బు తొలగిన చంద్రుడిలాగయింది. ''చిత్రరేఖా, నా దిగులంతా ఒక్క క్షణంలో పోగొట్టేశావు. నా అదృష్టం పండే ఉపాయం కూడా నువే చెయ్యి. వర్ణించలేను గాని, అతని ఆకారం కళ్ళకు కట్టినట్టే ఉంది. అతన్ని నువే వెతకాలి. నా భాగ్యమంతా నీ చేతిలోనే ఉన్నది,'' అన్నది.

''దానికేం? నే నున్నదే నిన్ను సుఖపెట్టటానికి కద. అతన్ని తీసుకు రావటం ఒక సమస్యకాదు. ముందు అత నెవరైనదీ తెలియాలి. అది తెలుసుకోవటానికి సాధన మేమిటా అని ఆలోచిస్తున్నాను. నువేమో అతన్ని వర్ణించలేనంటున్నావు. నేనేమో అతన్ని చూడకపోతిని,'' అన్నది చిత్రరేఖ.

ఉష అదిరిపాటుతో నిద్రలేచింది. కళ్లు తెరిచి చూస్తే ఎవరూలేరు. కాని జరిగినది కలలాగా లేదు, చాలా వాస్తవంగా ఉన్నది. ఆమెకు భయమూ, సిగ్గూ కలిగాయి. ఆమె పార్వతీదేవి చెప్పిన మాట పూర్తిగా మరిచిపోయి, ఆ కలవల్ల తనకూ, తన తండ్రి వంశానికీ అపకీర్తి వచ్చిందని దిగులుపడి, పెద్దగా ఏడవసాగింది.

చెలికత్తెలందరూ నిద్రలేచి ఆమె చుట్టూ మూగారు. చిత్రరేఖ ఆమె పక్కనే కూర్చుని, ఆమె తలను తన రొమ్ముకు అదుముకుని, ''చెలీ, భయపడకు. ఎందుకేడుస్తున్నావు? నీ మనసును కష్టపెట్ట

ఉష కళ్ళ నీళ్ళు నింపుకుంటూ, "ఎవరి పనులు వారు చేసుకోవటం సరి అయినది. ఇంకొకరి పని చెయ్యటం కష్టం. నువ్వు నా ప్రాణం లాంటి దానివి. నిజం చెబుతున్నాను. నువ్వు దయదలచని పక్షంలో నిశ్చయంగా నేను చచ్చిపోతాను," అన్నది.

చిత్రరేఖ ఆమెతో, "ఎందుకు నీకు విచారం? నాకు కాస్త వ్యవధి ఇయ్యి. నీ ప్రియుణ్ణి ఏదో విధంగా నీ సమక్షానికి తెస్తాను. లోకేశ్వరి అయిన పార్వతీదేవే నిన్ను కటాక్షించి ఉండగా నీ కోరికలు తీరటానికి సందేహమేమిటి?" అన్నది.

చిత్రరేఖ మిగిలిన చెలికత్తెలతో, "మీరు ఉషను కనిపెట్టి ఉండండి," అని చెప్పి, ఏకాంతంగా కూర్చుని, రంగులూ, కుంచెలూ తీసుకుని, ఒక వారం రోజుల లోపల ప్రపంచంలో గల ప్రముఖ పురుషులందరి చిత్రపటాలూ గీసింది. ఎవరెవరు ఎలాటి దుస్తులు ధరించేదీ, ఎలాటి ఆభరణాలు పెట్టుకునేదీ ఆ చిత్తరువులలో సరిగా చిత్రించింది. తరవాత ఆమె ఆ చిత్రపటాలన్నిటినీ ఉషవద్దకు తీసుకుపోయి, "చెలీ, సృష్టిలో ఉండే ప్రముఖుల నందరినీ కష్టపడి చిత్రించి తీసుకువచ్చాను. వీరిలో నీకు కలలో కనిపించిన వాడెవడో చూసి చెప్పు. ఈ పటాలలో దేవదానవమానవ ముఖ్యులందరూ ఉన్నారు," అన్నది చిన్నగా నవ్వుతూ.

ఉష ఒక్కొక్క చిత్తరువే చూసి పక్కన పెడుతూ యాదవ ప్రముఖుల దగ్గిరికి వచ్చేసరికి కృష్ణుడి పటం చూసి ఆశ్చర్యపడింది. తరవాత ప్రద్యుమ్నుడి పటం చూసి మరింత ఆశ్చర్యపడింది. ఎందుకంటే ఇద్దరిలోనూ అనిరుద్ధుడి పోలికలున్నాయి. అటు తరవాత ఆమె అనిరుద్ధుడి పటం తీసుకుని తనను తానే మరచిపోయింది. ఆమె దానిని పక్కన పెట్టలేదు. ఉష కలలో కనిపించినవాడు అతనేనని చిత్రరేఖ గ్రహించింది.






# దాచిపెట్టిన వీలునామా

అయిదారు వందల సంవత్సరాల క్రితం చీనా దేశంలోని ఒక రాష్ట్రానికి ''నీ షా-చియెన్'' అని రాజప్రతినిధి ఉండేవాడు. ఆయన బోలెడంత డబ్బూ, ఇళ్లూ, పొలాలూ సంపాదించాడు. ఆయనకు షాన్-చీ అని ఒకడే కుమారుడు. అతనికి పెళ్ళి అయాక తల్లి చనిపోయింది. ఆ తరవాత రాజప్రతినిధి "నీ" తన ఉద్యోగానికి రాజీనామా పెట్టి, స్వయంగా ఇళ్ళూ, పొలాలూ చూసుకోసాగాడు.

''నాన్నగారూ, మీరు పెద్దవారైపోయారు గదా, హాయిగా విశ్రాంతి తీసుకోండి. ఆస్తిపాస్తులకు సంబంధించిన వ్యవహారాలు చూసే పని నాకు వదిలెయ్యండి,'' అన్నాడు షాన్-చీ.

''నా బొందెలో ఊపిరి ఉండగా నా వ్యవహారాలు మరొకరు చూడటమేమిటి?" అన్నాడు ''నీ'' ఆయన అంతటితో పోనివ్వక, కొడుకుకు ఏమాత్రమూ సహించరాని మరొక పనికూడా చేశాడు. ఆయన ఒకనాడు గ్రామం వెంబడి షికారుగా నడుస్తూ ఉండగా రేవువద్ద బట్టలు ఝాడించుతూ ఒక పదహారేళ్ళ పిల్లా, ఆమె అమ్మమ్మా కనిపించారు. ఆ పిల్లపేరు మేయ్; ఆమెకు చిన్నతనంలోనే తల్లిదండ్రులు పోగా, పేదదైన అమ్మమ్మ దగ్గిర పెట్టుకుని సాకుతున్నది. మేయ్‌కి ఇంకా ప్రధానం జరగలేదు.

ఆమెను చూసేసరికి ''నీ''కి ఎంతో ముచ్చట అయింది. ఆయన ముసలావిడతో మాట్లాడి ఆ పిల్లను తనకిచ్చి పెళ్ళి చెయ్యమనీ, అలా చేసినట్టయితే ముసలిది బతికి ఉన్నంతకాలమూ సుఖంగా పోషిస్తాననీ, పిల్లకూడా గొప్పయింటి యజమానురాలై పదవీ, పలుకుబడీ గలది అవుతుందనీ చెప్పాడు. ఈ మాటలకు ముసలిది ఎంతో




త్వరలోనే మేయ్ గర్భవతిగా ఉండి కాలక్రమాన ఒక మగబిడ్డను కన్నది. వాడికి తండ్రి షాన్-షూ అని పేరు పెట్టుకున్నాడు. తనకు తమ్ముడు పుట్టాడని సంతోషించటానికి బదులుగా, దుర్మార్గుడైన షాన్-చీ మళ్ళీ తన సవతితల్లిపై అభాండాలు వేశాడు.

షాన్-చీ పేలే కారుకూతలన్నీ తండ్రికి తెలియవస్తూనే ఉన్నాయి. కాని ఆయన పైకి ఏమీ అనలేదు, అంతా కడుపులో పెట్టుకుని ఊరుకున్నాడు. తన ఆస్తిని తమ్ముడితోపాటు పంచుకోవలసి వస్తుందన్న ఏడుపుమూలంగానూ, ఎప్పటికైనా ఏదో మిషమీద ఆ పసివాడికి ద్రోహంచేసే ఉద్దేశంతోనూ షాన్-చీ ఇలాంటి ప్రచారం చేస్తున్నాడని కూడా ఆయన గ్రహించాడు.

సంతోషించింది. మేయ్ కూడా అభ్యంతరం చెప్పలేదు. మేయ్‌ని వయసు మళ్ళిన "సీ" పెళ్ళాడేసి ఆనందంగా తన ఇంటికి తెచ్చుకున్నాడు. మేయ్ వయసులో చిన్నదయినా దొడ్డబుద్ధి గలదని "సీ" సులువుగా గ్రహించాడు.

అయితే, ముసలితనంలో తండ్రి చేసుకున్న పెళ్లి షాన్-చీకి గాని, అతని భార్యకు గాని ఏమాత్రం నచ్చలేదు. మేయ్ మాయలాడి అనీ, ధనవంతుడయిన ముసలివాణ్ణి ఎలాగో బుట్టలో వేసిందనీ, ఆమె మూలంగా వంశగౌరవం కాస్తా మంట గలిసిపోతుందనీ వాళ్ళు ఆమెను నానామాటలూ అనుకున్నారు.

షాన్-షూకు అయిదేళ్ళు నిండగానే వాణ్ణి ఒక పంతులు దగ్గిరికి పంపారు. ఆ పంతులు దగ్గిరే షాన్-చీ కొడుకు కూడా చదువుతున్నాడు. తన కొడుకుకూ, తమ్ముడికీ ఎక్కడ సఖ్యత ఏర్పడిపోతుందోనని, షాన్-చీ తన కొడుకును ఆ బడి మాన్పించి మరొక పంతులుదగ్గిర పెట్టాడు. ఇది చూసి "సీ" మండిపడి, కొడుకును గట్టిగా మందలించుదామనుకున్నాడు; కాని దుర్మార్గుడితో మాట్లాడి ప్రయోజనం లేదని ఆ ఉద్దేశం మానుకున్నాడు.

తరవాత కొద్దిరోజులకే "నీ" పక్షవాతం వచ్చి పడిపోయాడు. వైద్యుడు వచ్చిచూసి, "పక్షవాతానికి మందు లేదు. ఇలాగే కొంత కాలం మంచంలో తీసుకుని తరవాత పోవలసిందే!" అన్నాడు.

షాన్-చీ తండ్రిని చూడడానికి వచ్చి, ఆయన ఇక లేచి తిరిగే అవకాశం లేదని తెలుసుకుని, తన అధికారం సాగించ నారంభించాడు. అప్పుడే తాను ఇంటి యజమాని అయిపోయినట్టు, అయినదానికీ కానిదానికీ నౌకర్లను కొట్టసాగాడు. మేయ్, షాన్-షూలు ముసలాడి మంచాన్నే అంటిపెట్టుకుని దుఃఖించసాగారు.

"నీ" తన అవసానకాలం ఆసన్నమయిందని గ్రహించి, ఒకనాడు తన పెద్ద కొడుకైన షాన్-చీని పిలిచి, అతనికి ఒక పుస్తకం ఇచ్చాడు; ఆ పుస్తకంలో "నీ" తాలూకు ఆస్తి వివరాలు ఉన్నాయి.

ఆయన తన పెద్దకొడుకుతో, "షాన్-షూ అయిదేళ్ళ పసివాడు. కొంతకాలం వాడు ఎవరో ఒకరి పోషణలో ఉండాలి. వాడి తల్లి కూడా పొలాలూ పుట్రా చూసుకోదగినంత ఈడుగలది కాదు. అందుచేత ఆస్తిలో వాళ్ళకిప్పుడు నేను వాటా ఇవ్వటంలేదు. అంతా నీపరమే చేస్తున్నాను. షాన్-షూ పెద్దవాడయాక వాడికి పెళ్ళిచెయ్యి. వాడికి ఒక చిన్న ఇల్లూ, పది ఎకరాల పొలమూ ఇయ్యి. లేకపోతే వాడు ఇంటికీ, తిండికీ ఇబ్బంది పడగలడు. ఈ విషయాలన్నీ ఈ పుస్తకంలో





రాసిపెట్టాను. మీరు విభాగాలు పడటానికి ఇది ఆధారంగా ఉంటుంది. నా రెండో భార్య తిరిగి పెళ్ళాడగోరే పక్షంలో హాయిగా పెళ్ళాడనీ. అలా కాకుండా విధవరాలుగా ఉండిపోయి తన కొడుకు వెంటే ఉండి పోతానంటే మాత్రం నువ్వేమీ ఒత్తిడి చెయ్యకు. నేను పోయాక నేను చెప్పినట్టుగా చేస్తివా నా ఆత్మకు శాంతి ఉంటుంది!'' అన్నాడు.

''నాన్నగారూ, మీరేమీ విచారించకండి. అక్షరాలా మీరు చెప్పినట్టే జరిపిస్తాను!'' అంటూ షాన్-చీ తండ్రి ఇచ్చిన పుస్తకం తీసుకుని పరమానందంతో వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళిపోయాక మేయ్ తన భర్తతో, ''వీడుమాత్రం మీ కొడుకు కాడా? అంతా మీ పెద్దవాడి చేతిలో పెట్టి వీడికేమీ లేకుండా చేశారేమిటి? మేం ఎలా బతకాలి?'' అన్నది కంట నీరు పెట్టుకుంటూ.

''నీకు తెలియదు. షాన్-చీని నమ్మటానికి లేదు. ఇప్పుడు నేను ఆస్తిని ఇద్దరికీ సమంగా పంచానంటే, వాడు చిన్నవాడి ప్రాణాలు తీసెయ్యగలడు. అంతా వాడి మొహానే కొడితే వాడికి అసూయ పుట్టదు. నువుకూడా చిన్నదానివేగనక పిల్లవాడి పోషణభారం షాన్-చీపై పెట్టాను. నేను పోయాక నువు ఇక్కడే ఉండి కష్టాలు పడకు. తగిన భర్తను చూసి మళ్ళీ పెళ్ళి చేసుకుని యావజ్జీవం సుఖంగా ఉండు,'' అన్నాడు.

''మాది కూడా పరువుగల వంశమే. నేను మళ్ళీ పెళ్ళి చేసుకుని నా కొడుక్కి దూరమౌతానా? కష్టమో, సుఖమో పిల్లవాడి వెంటే ఉంటాను!'' అన్నది మేయ్.

ఆమె అభిప్రాయం మార్చుకోదని రూఢి చేసుకుని ''నీ'' ఆమెతో, ''అలా అయే పక్షంలో నీకూ, నీ కొడుక్కూ ఏ లోటూ లేకుండా చేస్తాను,'' అంటూ తన

తలగడ కిందినుంచి ఒక "చుట్ట" పైకి తీసి ఆమె చేతికిచ్చాడు.

"ఇది ఏమిటి?" అని అడిగింది మేయ్.

"ఇది నా చిత్తరువు. ఇందులో ఒక రహస్యమున్నది. ఎవరికీ చూపకుండా దీన్ని నీవద్ద దాచుకో. నీ కొడుకు పెరిగి పెద్దవాడయాక వాడికి షాన్-చీ సహాయం చెయ్యనిరాకరించినట్టయితే, ఈ ప్రాంతాలకు తెలివిగలవాడూ, న్యాయబుద్ధి గలవాడూ అయిన న్యాయాధికారి వచ్చినప్పుడు, ఆయన కీచిత్తరువు చూపి ఫిర్యాదుచెయ్యి. ఈ బొమ్మను శ్రద్ధగా చూసినాక ఆయన నీకూ, నీ కొడుక్కూ సుఖంగా జరిగిపోయేలాగా తీర్పు చెబుతాడు," అన్నాడు "నీ"

తరవాత కొద్దిరోజులకు ఆయన పోయాడు.

తండ్రి చావగానే షాన్-చీ తాళపు చెవులన్నీ స్వాధీనం చేసుకున్నాడు; ముసలివాడి అంత్యక్రియలు పూర్తి అయాక, ఇల్లు మరమ్మత్తు చేసే మిషమీద తన సవతితల్లినీ, సవతితమ్ముణ్ణీ వాళ్ళ గదులలోనుంచి కదిలించి, దొడ్లో ఉండే మూడు గదుల కుటీరంలో వారికి నివాసం ఏర్పాటు చేశాడు. వాళ్ళకు చాకిరిచెయ్యటానికి ఒక చిన్నపిల్లను మాత్రమే ఇచ్చాడు. రోజూ వారికి కావలిసిన బియ్యం మటుకు పంపేవాడు. కూరానారా పంపేవాడుకాడు. కూరలకూ, ఇతర ఇంటి ఖర్చులకూ అవసరమైన డబ్బు, మేయ్ కష్టపడి కుట్టుపని చేసి సంపాదించేది.

షాన్-చీ తన మనుషుల్లో ఒకరిని సవతి తల్లి వద్దకు పంపి, ఆమె తిరిగి పెళ్ళాడితే బాగుంటుందని చెప్పించాడు. మనువులు కుదిర్చేవాళ్లని కూడా ఆమె వద్దకు పంపించాడు. తాను చచ్చినా తిరిగి పెళ్ళాడనని మేయ్ అందరితోనూ చెప్పేసింది. ఆ తరవాత షాన్-చీ ఆమెను గురించీ, ఆమె కొడుకును గురించీ పట్టించుకోవటం మానేశాడు. —(ముగింపు వచ్చే సంచికలో)





# మూడు వస్తువులు

సోమేంద్రుడనే పండితుడు, ఒక నదీ తీరాన చెట్టుచేమలతో ప్రశాంతంగా వుండే ప్రదేశంలో, ఒక గురుకులం నడుపుతూండేవాడు. గురుకులంలో చాలామంది విద్యార్థులుండేవారు. వారిలో రాధారమణుడు అనే విద్యార్థిపై, ఆయనకు ప్రత్యేకాదరణ వుండేది. గ్రహణశక్తిలో, సత్ప్రవర్తనలో, తెలివితేటల్లో, మిగతా విద్యార్థులెవరూ రాధారమణుడికి సాటి వచ్చేవారు కాదు.

రాధారమణుడు ఎప్పుడుగాని తోటి విద్యార్థులతో, వ్యర్థమైన వాదప్రతివాదాలకు దిగేవాడుకాదు. గురువు బోధించేది శ్రద్ధగా వినేవాడు. సాయంసమయాలను నదీతీరాన ఏకాంతంగా కూర్చుని పుస్తకపఠనంలో గడుపుతూండేవాడు.

రామభద్రుడూ, కృష్ణదీక్షితుడూ అనే విద్యార్థులిద్దరికి, రాధారమణుడంటే ఎంతో అసూయగా వుండేది. తమ గురువు, అతడిపట్ల కనబరిచే ఆప్యాయతా, ఆదరణా వాళ్ళకు చెప్పరాని చికాకు కలిగిస్తూండేది.

ఒకనాడు సోమేంద్రుడు, విద్యార్థులకు పాఠాలు చెప్పడం ముగించి, ఒక చెట్టు కింద విశ్రమించివుండగా, వాళ్ళిద్దరూ ఆయనను సమీపించి, "గురుదేవా, విద్యార్థులలో తెలివితేటలూ, మంచి నడవడికా గలవారిపట్ల, తమకు ఎంతో ఆదరాభిమానాలున్న సంగతి, అందరికీ తెలుసు. కాని, రాధారమణుడిపట్ల తమరు కనబరిచే ప్రత్యేకాదరణ, మా అందరికీ ఆశ్చర్యం కలిగిస్తున్నది," అన్నారు.

అందుకు సోమేంద్రుడు చిరునవ్వు నవ్వి, "గురుకులంలోని విద్యార్థులందరూ, నాకు ప్రేమపాత్రులే. అందులో

కొండూరు పరిమళ

సందేహం లేదు. అయితే, రాధారమణుడు వేద, శాస్త్ర, ఇతిహాసాల గురించిన విషయాల్లో, మీ అందరికన్నా దిట్ట. అంతేకాక అతడిలో, మీకన్న లౌకిక జ్ఞానమూ, తార్కికదృష్టీ ఎక్కువ,'' అన్నాడు.

''క్షమించండి, గురుదేవా! మీరనే దానికి రుజువేమిటి?'' అన్నారు రామభద్రుడూ, కృష్ణదీక్షితుడూ.

''అయితే, మీ అందరికీ ఇప్పుడు ఒక కథ చెబుతాను. ఆ కథలో వున్న సమస్యకు చక్కని పరిష్కార మార్గం చూపగలవాడు, మీలో అందరికన్న మేధాశక్తి గలవాడు. మీ తోటి విద్యార్థు లందరినీ ఒకచోట సమావేశపరచండి,'' అన్నాడు సోమేంద్రుడు.

విద్యార్థులందరూ ఒక చెట్టు నీడలో సమావేశమయ్యాక, సోమేంద్రుడు వారికొక కథ చెప్పాడు:

సూర్యనగర రాజ్యానికి, పూర్ణచంద్రుడనేవాడు చిన్నతనంలోనే రాజయ్యాడు. అతడికి తల్లీ, పెళ్ళెడుకొచ్చిన చెల్లెలూ, భార్యా వున్నారు. ఆ ముగ్గురిపైనా అతడికి చాలా ప్రేమ.

ఒకనాడు అతడి వద్దకు ఒక యోగి వచ్చి, ఒక గుళికా, ఒక హారమూ, ఒక పుష్పమూ యిచ్చి, ''రాజా, వీటిని నీపై ప్రేమగలవారికి యివ్వు. ఈ గుళిక మింగినవారికి, ఎప్పుడుగాని ఏ విచారాలూ కలగవు. వాళ్ళు క్షేమంగా వుంటారు. ఈ హారాన్ని ధరించినవారివల్ల



నీకు చాలా మంచి కలుగుతుంది. ఈ పుష్పం తలలో పెట్టుకున్నవారి అందం రెండింతలవుతుంది,'' అని చెప్పి ఆశీర్వ దించి వెళ్ళిపోయాడు.

తనకు ప్రేమపాత్రులు ముగ్గురున్నారు. యోగి యిచ్చిన వస్తువులు సరిగ్గా మూడున్నవి. అందులో ఒక్కటీ తనకు కాదు. దేన్ని ఎవరికివ్వాలో రాజుకు తెలియలేదు!

సోమేంద్రుడు, ఈ కథ చెప్పి, విద్యార్థులతో, ''రాజుకు ఎదురైన సమస్య ఏమిటో విన్నారుగదా? మీరే అతడి సమస్యకు పరిష్కార మార్గం చెప్పండి,'' అన్నాడు.

రామభద్రుడూ, కృష్ణదీక్షితుడితో పాటు, అక్కడ సమావేశమయిన మిగిలిన విద్యార్థులు కూడా, రాజు ఆ మూడు వస్తువులలో దేన్ని ఎవరి కివ్వాలో తృప్తి కరంగా చెప్పలేకపోయారు.

అప్పుడు రాధారమణుడు లేచి నిలబడి ఇలా చెప్పాడు: ''రాజు తల్లి వితంతువు. ఆమె చీకూచింతా లేకుండా క్షేమంగా వుంటే, రాజుకు ఎంతో సంతోషకారణం అవుతుంది. కనుక గుళికను ఆయన తన తల్లికివ్వాలి. భార్యవల్ల జీవితాంతం మంచి జరిగితే, అతడి దాంపత్య జీవితం సుఖంగా గడుస్తుందిగనక, రాజు హారాన్ని భార్యకివ్వాలి. యోగి యిచ్చిన పుష్పాన్ని తలలో పెట్టుకున్నవారి అందం రెట్టింపవుతుందిగనక, ఆ పుష్పాన్ని రాజు పెళ్ళీడుకొచ్చిన తన చెల్లెలికివ్వాలి. ఆ విధంగా ఆమెకు మంచి వరుడితో తేలికగా వివాహం జరిగిపోతుంది,'' అన్నాడు.

రాధారమణుడు చెప్పిన పరిష్కార మార్గం సోమేంద్రుడితోపాటు, విద్యార్థు లందరికీ సరిఅయినదని తోచింది.

వాళ్ళు ఆనందంతో హర్షధ్వానాలు చేశారు.

ఆనాటి వరకూ రాధారమణుడిపట్ల అసూయతో వున్న రామభద్రుడూ, కృష్ణ దీక్షితుడూ అతణ్ణి ఎంతగానో అభినం దించారు.





# చిదంబరం రహస్యం

ఒక వూళ్ళో చిదంబరం అనే సాహుకారు ఉండేవాడు. అతడు పరమలోభి. కాని అతని భార్యకు దానధర్మాలంటే అసక్తి.

ఒకప్పుడు పండక్కి గ్రామస్థులందరూ చందాలు వేసుకుని, హరిదాసుగారి చేత కాలక్షేపం చేయించటానికి ఏర్పాటు చేసుకున్నారు. చిదంబరం ఒక్క పైసా అయినా ఇవ్వక, "నా కిలాంటి డబ్బు దండగ పనులు ఇష్టం లేదు. నాకీ కాలక్షేపాలేవీ అక్కర్లేదు," అని కచ్చితంగా చెప్పేశాడు.

ఆ క్షణం నుంచీ భార్యాభర్తల మధ్య కలహం ప్రారంభమైంది. "డబ్బివ్వక పోతే పోయె, ముక్తిమార్గం తెలుసుకోవటానికి ముచ్చటగా మూడే మూడు ముక్కలు విని రాకూడదా?" అని భార్య పట్టు పట్టింది. ఇల్లాలి పోరు పడలేక, సరే లెమ్మని చిదంబరం మూడే మాటలు వినటానికి ఒప్పుకున్నాడు.

ఆ రాత్రి కాలక్షేపానికి పెద్ద మర్రి కింద పందిట్లో యేర్పాట్లు జరిగాయి. జనం కిటకిట లాడుతున్నారు. చిదంబరం కూడా వచ్చి ఒక పక్క కూర్చున్నాడు. హరిదాసుగారు పూలమాల వేసుకుని, కాళ్ళ గజ్జెలు కట్టుకుంటూ వుండగా గ్రామాధికారి సభవేపు తిరిగి, "పెద్దలంతా వచ్చినట్టేనా, ఇంకెవరైనా రావాలా?" అని అడిగాడు. "ఓహో, ఇది దాసుగారు చెప్పే మొట్టమొదటి మాట కామాలు. వినవలసిన మూడు మాటల్లోనూ అప్పుడే ఒకటి వినేశాను," అనుకున్నాడు చిదంబరం.

అంతలోనే చోటు చాలక జనం కొంత మంది నించుని, కూర్చున్న వాళ్ళకి అడ్డంగా వున్నారు. గ్రామాధికారి మళ్ళీ లేచి, "కూర్చోండి! కూర్చోండి!" అంటూ వాళ్ళను గట్టిగా హెచ్చరించాడు. అదే

రెండో మాట కామాలు అనుకున్నాడు, చిదంబరం.

జనం విపరీతంగా రావటంవల్ల స్థలం లేక కొంతమంది వచ్చిన దారినే మళ్ళీ పోవలసి వచ్చింది. అప్పుడు గ్రామాధికారి, "వెళ్ళకండి! వెళ్ళకండి! దాసు గారు వచ్చేస్తున్నారు!!" అని మళ్ళీ జనానికి నచ్చజెప్పాడు. ఇది విని చిదంబరం, "సరే, నేను వినవలసిన మూడు మాటలూ పూర్తి అయినాయి," అనుకుని, ఇంటికి వచ్చేసి హాయిగా నిద్ర పోయాడు.

ఈ సంగతి తెలియక, ఎంత చెప్పినా తన మాట భర్త చెవికెక్కలేదుకదా అని కోపం కొద్దీ చిదంబరం భార్య, పిల్లల్ని వెంటబెట్టుకుని కాలక్షేపానికి వెళ్ళి పోయింది. ఆ సందట్లో ఆమె ఇంటి తలుపు వెయ్యడం మరిచిపోయింది.

ఇదంతా కనిపెట్టి చూస్తూన్న దొంగలు ఆమె వెళ్ళిపోగానే ఇంట్లో చొరబడ్డారు. మెల్లిగా అడుగులో అడుగు వేసుకుంటూ, గదిలోకి వెళ్ళేసరికి, చిదంబరం, "పెద్ద లంతా వచ్చినట్టేనా, ఇంకెవరైనా రావాలా?" అని పలవరించాడు.

దొంగలు అదిరిపడ్డారు.

ఇంటి యజమాని మేలుకునే వున్నాడని తెలుసుకుని, ఎక్కడివాళ్ళక్కడే చతికిలబడ్డారు.

అప్పుడు చిదంబరం, "కూర్చోండి! కూర్చోండి!" అని గ్రామాధికారి చేసిన హెచ్చరిక పలవరించాడు.

"అరే, మనం కూర్చోవటం కూడా ఈయనకి తెలిసిందే! మనల్ని చూసే వుంటాడు," అని అనుకుని, ఒకొక్కళ్ళే లేచిపోవటానికి సిద్ధపడ్డారు.

అంతలో నిద్రపోతున్న చిదంబరం మళ్ళీ, "వెళ్ళకండి, వెళ్ళకండి! దాసు గారు వచ్చేస్తున్నారు!!" అని పలవరించాడు.

యజమాని తమను తరుముకువస్తున్నాడని భయపడి, వెనక్కి తిరిగి చూడకుండా దొంగలు కాలికొద్దీ పరుగుచ్చుకున్నారు.



హిందూమహాసముద్రంలోనూ, పసిఫిక్ మహాసముద్రంలోనూ నీటి అడుగున సముద్రపు కుందేలు అనే జలచరం నివసిస్తున్నది. కుందేలుచెవులవంటి మీసాలు కలిగి వుండడం వల్ల దీనికి ఈ పేరు వచ్చింది. ఒక సముద్రపు కుందేలు 478,000,000 గుడ్లు పెడుతుంది.







ఎండి, గట్టిపడిపోయిన అనిమోనీ వంటి అతి చిన్న జంతువుల అస్థిపంజరాల గుంపులే పగడాలు. వీటి నిండుగా కాల్షియం వుంటుంది।

## వింత ఎడారి ఎలుక

ఎలుకజాతికి చెందిన జెర్బోవా అనే జంతువు వెనకకాళ్ళు ముందుకాళ్ళకన్న నాలుగింతలు పెద్దవి. తల, శరీరభాగం కలిపినా, దానికన్నా దీనితోక పొడవైనది. ఈ ఎలుక ఒక్కగెంతున 10 అడుగులు దాటగలదు. అలా ఎగిరేప్పుడు సమతౌల్యం తప్పిపడిపోకుండా దీని తోక ఉపయోగపడుతుంది.



# మీ పాపాయికి
# అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి, పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి. సెరిలాక్ లాభాన్ని అందించండి.

**పోషకాహార లాభం :** సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు, ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజాలూ అన్నీ వున్నాయి. అన్నీ సమ పాళల్లో వున్నాయి.

**రుచి లాభం :** పాపాయికి సెరిలాక్ రుచి ఇష్టం.

**సమయం ఆదా లాభం :** సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ, పంచదార వున్నాయి. దానికి వెచ్చటి నీటితో కలిపితే చాలు.

**ఎంపిక లాభం :** ఎంచుకునేందుకు మూడు రకాల సెరిలాక్ వుంది.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకూ, తయారుచేయటంలో పరిశుభ్రతను పాటించేందుకూ, డబ్బా మీది సూచనలను జాగ్రత్తగా పాటించండి.




6 మాసాలు నించీ




4 మాసాలు నించీ




6 మాసాలు నించీ

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి సెరిలాక్
పోస్ట్ బాక్స్ నెం 3
న్యూ ఢిల్లీ 110008




## సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం-ఎంతో రుచికరం

RK SWAMY/FSL/5112/TEL

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1989 అక్టోబర్ నెల సంచికలో ప్రకటింపబడును.





Anant Desai — B. Bhansali

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ అగస్టు నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : నఖ్యతగా ఉంటే మోదం! — రెండవ ఫోటో : సరిపోకపోతే ఖేదం !!

పంపినవారు : టి. వి. రాఘవేంద్రరావు, మచిలీపట్నం—521002 (ఆం. ప్ర.)

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.




Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.


---